# ముందుమాట

భారతీయ ఆర్థిక వ్యవస్థను గురించి అనేకమంది ప్రముఖ అర్థ శాస్త్రజ్ఞులు అనేక గ్రంథాలు రచించారు. కాని అవి చాలావరకు సాంప్రదాయ సిద్ధమైన పాతచట్రాన్ననుసరించే వ్రాయబడ్డాయి. అభ్యుదయ దృష్టితో వ్రాయబడినవి చాలా తక్కువే ఉన్నాయని చెప్ప సాహసిస్తున్నాను. అవికూడా యింగ్లీషు భాషలోనే రచింపబడుటవలన ఆంధ్ర పాఠకలోకానికి అందుబాటులో లేకుండా పోయాయి. అందువలన తెలుగుభాషా పరిజ్ఞానం మాత్రమేవున్న ఆంధ్ర పాఠకులకు సులభంగా అర్థమయ్యేందుకుగాను యీ పుస్తకం వ్రాయ సంకల్పించాను.

మరొక విషయం. నేను విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రాన్నభ్యసించలేదు. అర్థశాస్త్రమందు నాకుగల అభిరుచినిబట్టి కొంత అధ్యయనం సాగించాను. నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానంతో యీ సాహసానికి పూనుకున్నాను. కావున పాఠకలోకం సహృదయతతో దీనిని పరిశీలించి ఆదరణతో యిచ్చే సలహాలను, చేసే విమర్శలను స్వీకరించ సిద్ధంగా ఉన్నాను.

ఇట్లు,

రచయిత.

# ఉపోద్ఘాతం

ఏ దేశంలోనైనా ఆ దేశపు సామాజిక, రాజకీయ వ్యవస్థలకు ఆర్థిక వ్యవస్థ పునాదిగా ఉంటుందనేది అందరూ అంగీకరిస్తున్న విషయమే. ఈనాడు మనదేశంలో మన ప్రభుత్వమూ, పాలకవర్గ పార్టీయైన కాంగ్రెసు సంస్థ, యితర ప్రముఖ రాజకీయ పార్టీలు - అన్నీ సోషలిస్టు సామాజిక వ్యవస్థా నిర్మాణమే తమ ధ్యేయమని ప్రకటించాయి. మన పార్లమెంటు ఆమోదించిన రెండవ పంచవర్ష ప్రణాళికలో సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని లక్ష్యంగా ప్రకటిస్తూ తదనుగుణ్యంగానే ఆర్థిక వ్యవస్థా నిర్మాణం జరగాలని చెప్పబడింది.

ప్రపంచ చరిత్రయొక్క అనుభవాన్నిబట్టి పాత వ్యవస్థయొక్క పునాదులను సమూలంగా మార్చనిదే నూతన సామాజిక వ్యవస్థా నిర్మాణం అసాధ్యమని రుజువయింది. కాని మనదేశంలో అలాంటి మార్పు అవసరం లేకుండానే "నూతన పంథాలో పాతచట్రం అలా ఉండగానే క్రమ పరిణామంద్వారా" సామాజిక వ్యవస్థను మార్చివేయగలమని మన ప్రభుత్వమూ, పాలకవర్గ పార్టీ, విరివిగా ప్రచారం సాగిస్తున్నాయి. అనేకమంది ప్రజాస్వామికవాదులు దీనిని విశ్వసిస్తున్నారుకూడా.

పబ్లిక్ రంగాన్ని విస్తరింపజేయుట, ఆ రంగంలో కొన్ని కీలక పరిశ్రమలు నెలకొల్పుటకు కృషిచేయుట, ఇంపీరియల్ బ్యాంకు, జీవిత భీమాలను జాతీయంచేయుట వగైరా చర్యలద్వారా క్రమంగా సోషలిజం నిర్మించబడుతూందని విశ్వసించేవారు లేకపోలేదు.

అందువలన మన ఆర్థిక, సామాజిక వ్యవస్థలలో యీనాడు జరుగుతున్న పరిణామ స్వభావమేమిటో యథాతథంగా మీ యెదుట ఉంచడమే యీ రచనయొక్క ఉద్దేశ్యం.

ఇట్లు,

రచయిత.



# జాతీయ ఆర్థికాభివృద్ధి సమస్యలు

భారతదేశం ఆర్థికాభివృద్ధి దృష్ట్యా చాలా వెనుకబడియున్నది. సత్వరమే ఆర్థికాభివృద్ధిని సాధించాలంటే మనకుగల అవకాశాలను, మనల నెదుర్కొంటున్న సమస్యలను పరిశీలించవలసి యున్నది.

## భారతదేశపు సహజ సంపద

ఏ దేశములోనైనా లభ్యమయ్యే సహజసంపదలను బట్టే ఆ దేశాభి వృద్ధికి గల అవకాశాలను అంచనావేయడం సాధ్యమౌతుంది. సహజసంపద లను సక్రమంగా వినియోగించినట్లయితే సత్వర ఆర్థికాభివృద్ధి జరుగుతుంది. పరిశ్రమల నభివృద్ధిచేసి, జాతీయాదాయాన్ని పెంచి ప్రజల జీవనస్థాయిని మెరుగుపరచుకొనుటకు వీలవుతుంది.

రష్యా, అమెరికాల తర్వాత ప్రపంచంలో సహజసంపద యెక్కు వగాగల దేశం భారతదేశమని ప్రతీతి. మన దేశం 12 లక్షల 69 వేల 640 చ. మై. విస్తీర్ణము కలిగియున్నది. ఇంగ్లండుకన్న 13 రెట్లు, జపాన్ కన్న 8 రెట్లు పెద్దది. 13 కోట్ల 30 లక్షల యకరాల విస్తీర్ణము గల బ్రహ్మాండమైన అడవులనుండి యెంతో అటవీసంపద లభ్యమవుతుంది. 135 కోట్ల 60 లక్షల యకరాల అడుగులనీరు ప్రవహిస్తున్న గంగా, బ్రహ్మ పుత్ర, మహానది, గోదావరి, కృష్ణ, కావేరి, మొదలైన నదులున్నాయి. సువిశాలమైన దేశం కావడంవలన విభిన్న శీతోష్ణస్థితులు, నైసర్గిక స్వరూ పాలు గలిగిన ప్రదేశాలున్నాయి. అందువలన అనేక రకాలైన వ్యవసా యపు పంటలు పండించ వీలవుతుంది.

ఇంతవరకు సక్రమమైన అంచనాలు లేకపోయినప్పటికి మనదేశంలో పారిశ్రామికాభివృద్ధి కవసరమైన ఖనిజసంపద అపారంగా ఉన్నట్లు

తెలుస్తున్నది. బొగ్గు, యినుము, యినుపరాయి, కాకిబంగారం, బాక్సైటు, మాగ్నసైట్, జిప్సమ్‌లు, రంగును తయారు చేసేందుకు వినియోగించే టిటానియం, అణుశక్తికి వినియోగపడే థోరియం వగైరాలు విరివిగా లభ్య మవుతున్నాయి. ఈ మధ్యనే భారీరసాయనిక పరిశ్రమ కవసరమైన గంధ కాన్ని యివ్వగల పైరైట్ ఖనిజం షహాబాద్ జిల్లాలో విరివిగా ఉన్నట్లు కనుగొనబడింది. (సీసము, తుత్తునాగము, తగరము వగైరా ఖనిజాలు మాత్రము యింతవరకు మనదేశంలో ఉన్నట్లు తెలియలేదు.) ఈ మధ్య జరిపిన పరిశోధనల ఫలితంగా దేశంలో అస్సాంలోనేగాక జ్వాలాముఖి, కాంబే వగైరా ప్రాంతాలలో పెద్ద పెద్ద నూనె గనులు కూడ ఉన్నట్లు కనుగొనబడింది.

జనసంపదకూడ మనకేమీ తక్కువకాదు. ప్రపంచం మొత్తం మీద 60 కోట్ల జనాభాగల్గిన చైనా తర్వాత 40 కోట్ల జనాభాగల మనదేశమే పెద్దది. మన జనాభాలో 15-55 సంవత్సరాల మధ్యవయస్సుగల్గి పనిచేయ గలశక్తిగల వారు దాదాపు 21 కోట్లున్నారు. దేశంమొత్తంపైన నిరుద్యోగు లుగా ఉన్న దాదాపు 5½ కోట్ల మందికి ఉద్యోగావకాశాలుంటే ప్రస్తుత సాంకేతిక స్థాయిలోనే సంవత్సరానికి అదనంగా రు, 3551 కోట్లు విలువగల జాతీయాదాయాన్ని సృష్టించుకోవచ్చు.

దేశాభివృద్ధికి యిన్ని అవకాశాలున్నా మనదేశం చాలాకాలం బ్రిటిష్‌సామ్రాజ్యవాదుల వలసదేశంకావడంవలన ఆర్థికాభివృద్ధికి అంత రాయం కలిగి చాలా వెనుకబడినదేశంగా వుండిపోయింది.

బ్రిటిష్‌వారు రాకపూర్వమే ఫ్యూడల్ వ్యవస్థఫలితంగా మన ప్రజల ఆదాయాల్లో విపరీత వ్యత్యాసాలు యేర్పడ్డాయి. ఒకవైపున విందులు, విలాసాలలో తులతూగే ఫ్యూడల్ ప్రభువులు' వారి దళారులు, రెండవ వైపున బీదరికంతో బాధపడే సాధారణప్రజలు తయారయ్యారు. దేశాభి వృద్ధి కవసరమైన అదనపు ఆర్థికసంపదలో కొంతభాగం ఫ్యూడల్ ప్రభువుల విలాసాలకు ఖర్చుచేయబడుతూ వచ్చింది. మరికొంతభాగం వారియొక్క బంగారపు, వెండినిధుల రూపంలో కోశాగారాల్లో మూల్గుతూ పనికి రాకుండాపోయింది.

## బ్రిటిష్ పాలన - దుష్ఫలితాలు

బ్రిటిష్ పరిపాలన ప్రారంభం కావడంతో పరిస్థితి మరింత విష మించింది. బ్రిటిష్‌వారు ఫ్యూడల్ దోపిడీతోపాటు తమ దోపిడీనికూడ కొనసాగించారు. తమ పరిపాలనా కాలంలో సంవత్సరానికి సగటున 15 కోట్ల పౌనులను (దాదాపు 200 కోట్ల రూపాయలు) మనదేశంనుండి ఇంగ్లండుకు తరలించుకుని పోయేవారు. మనదేశాన్ని తమ పరిశ్రమలకు ముడి సరుకులను సరఫరాచేసే దేశంగా తయారుచేశారు. మన వ్యవసా యాన్ని పూర్తిగా అశ్రద్ధచేశారు. 1914 యుద్ధకాలం వరకు మన పరిశ్రమ లేవీ పెంపొందకుండ అరికట్టారు. తరువాత ఏళ్లలో కొన్ని వాడకపు సరు కుల పరిశ్రమలుమాత్రం అనేక యిబ్బందులను చెట్టుకొని కొద్దిగా అభివృద్ధి కాగలిగాయి.

వీటన్నింటి ఫలితంగా మనదేశం ఆర్థికాభివృద్ధిలో చాలా వెనుకబడి పోయింది. మన జాతీయాదాయం ఎదుగుబొదుగులు లేకుండా తక్కువ స్థాయిలో ఉండిపోయింది. ప్రజల జీవనస్థాయి క్రమంగా క్షీణించింది, కరువులు, కాటకాలు, నిరుద్యోగం నిత్యం తాండవిస్తూ వచ్చాయి. విద్యా విజ్ఞానాలు లేక అనేక ప్రజానీకం అనాగరికులుగా ఉండిపోయారు.

## జా తీ యా దా య ం

దేశంలో సంవత్సరం మొత్తంమీద వస్తూత్పత్తి ద్వారానూ, ఉద్యో గాల ద్వారానూ ఆస్తిపరులకు, శ్రామికులకు లభిస్తున్న మొత్తం ఆదా యాన్ని జాతీయాదాయం అంటారు.

జాతీయాదాయపు అంచనాలు ఎప్పటికప్పుడు దేశంలోని ప్రజల జీవన స్థాయిని తెలుసుకునేటందుకు, ఆర్థిక వ్యవస్థ పురోభివృద్ధి గమనాన్ని పరిశీలించేందుకు, దానిలోని లోపాలోపాలను గమనించేందుకు ఉపకరిస్తాయి.

గతంలో భారతదేశపు జాతీయాదాయాన్ని అంచనా వేసేందుకు కొంతమంది అర్థ శాస్త్రవేత్తలు వ్యక్తిగతంగా ప్రయత్నించారు. 1868 వ సంవత్సరంలో దాదాభాయి నౌరోజీ మొట్టమొదటిసారిగా ఆనాడు మన తలసరి సంవత్సర సగటు ఆదాయం రు. 20/- ఉంటుందని అంచనా వేశారు. 1911 లో ఫిన్లేషిరాస్ అనే ఆయన రు. 49/- ఉండవచ్చునని, 1914లో షా, కంబాతా అనే వారిద్దరు రు. 36/- ఉండవచ్చునని తేల్చారు.

మొదటిసారిగా శాస్త్రీయ పద్ధతుల ననుసరించి డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు 1931 - 32 లలో మన తలసరి సాంవత్సరిక సగటు ఆదాయం రు. 65/- ఉండవచ్చుననీ, 1942 - 43 నాటికిది రు. 114/- కు పెరిగిందనీ లెక్కగట్టారు. 1949 - 50 లో ఈస్టరన్ ఎకానమిస్టు పత్రిక రు. 214/- వున్నట్లు అంచనా వేసింది.

1949 లో కేంద్ర ఆర్థికమంత్రిత్వశాఖ తరఫున ఒక జాతీయాదాయ సంస్థ నెలకొల్పబడింది. ప్రొఫెసర్ మహాల నోబిస్, ప్రొఫెసర్ గాడ్గిల్, డా॥ వి. కె. ఆర్. వి. రావులతో ఒక కమిటీ నియమింపబడింది. ఆ కమిటీ ప్రొఫెసర్ సైమన్ కుజ్ నెట్స్ వగైరా విదేశీ నిపుణుల సహాయంతో జాతీయాదాయాన్ని గురించి అధికారయుతమైన అంచనాలను తయారు చేసింది. దాని ప్రకారం 1948-'49 లో జాతీయాదాయం ఆనాటి ధరల ననుసరించి రు. 8,650 కోట్లు, 1949-'50 లో రు. 8,820 కోట్లు; 1950 -51లో రూ 8850 కోట్లు,1951-'52 లో రు. 9,100 కోట్లు,1952-'53లో 9,460కోట్లు, 1953-'54లో రు. 10,030 కోట్లు, 1954-'55 లో 10,280కోట్లు, 1955-'56లో రు. 11,010 కోట్లు ఉన్నది. ఆ విధంగా 1951-'52 నుండి 1955-'56 ల మధ్య, అనగా మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో మన జాతీయాదాయం 18.4% పెరిగింది. తలసరి సగటు ఆదాయం రు. 246.03 నుండీ, రు. 273.06 కు అంటె 11.1% పెరిగింది.

వివిధరంగాలనుండి జాతీయాదాయం యీ క్రిందివిధంగా వచ్చినట్లు అంచనావేయబడింది.

(కోట్లరూపాయలలో)

| వివరం | 1950-51 | మొత్తంలో% | 1953-'54 | మొత్తంలో% |
|---|---|---|---|---|
| వ్యవసాయం | 4890 | 51.3 | 5400 | 50.9 |
| గనులు-పరిశ్రమలు చేతివృత్తులు | 1530 | 16.1 | 1800 | 17.0 |
| వ్యాపార, వాణిజ్య రవాణాలు | 1690 | 17.7 | 1800 | 17.0 |
| ఇతర ఉద్యోగాలు | 1440 | 15.1 | 1610 | 15.1 |
| మొత్తం | 9550 | 100.2 | 10,610 | 100.1 |

| వివరం | 1950-51 | మొత్తంలో% | 1953-'54 | మొత్తంలో% |
|---|---|---|---|---|
| విదేశాలనుండి ఆదాయం | —20 | —0.2 | —10 | —0.1 |
| జాతీయాదాయం మొత్తం | 9530 | 100 | 10,600 | 100 |

పై వివరాలనుబట్టి మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో మన జాతీయాదాయం 18.4% పెరిగినప్పటికీ

(I) ఇతరదేశాలతో పోల్చినప్పుడు మన తలసరి సగటు ఆదాయం చాలా తక్కువని తెలుస్తుంది. క్రింది టేబిల్ చూడండి.

| దేశం పేరు | | సంవత్సరంలో తలసరి సగటు ఆదాయం |
|---|---|---|
| భారతదేశం | ... | 55.7 (డాలర్లు) |
| అమెరికా | ... | 1453.0 ,, |
| కెనడా | ... | 856.0 ,, |
| న్యూజిలాండ్ | ... | 85.0 ,, |
| ఇరాక్ | ... | 85.0 ,, |

(II) ప్రజల జీవనస్థాయిలో ఎట్టి అభివృద్ధి లేదనికూడా తెలుస్తుంది. 1931-32 లో తలసరి సగటు ఆదాయం రు. 65 ఉంటే, 1955-56 లో అది రు. 273.6 పెరిగినట్లు కనబడుతూంది. కాని యిదే సమయంలో ధరల సూచిక 1931-32 లో 100 నుండి 1956 నాటికి 400 కు పెరిగిందనేది గమనించాలి. తలసరి సగటు ఆదాయం దాదాపు 4 రెట్లు పెరిగితే ధరలు కూడా దాదాపు 4 రెట్లు పెరిగాయిగాన పరిస్థితిలో మార్పేమీలేదని తెలుసుకోవచ్చు.

అంతేగాదు. పైలెక్క ధనికులకు, బీదలకు కలిపి వేసిన సగటు లెక్క మాత్రమే. యథార్థానికి సాధారణ ప్రజల తలసరి ఆదాయం చాలా తక్కువే ఉంటుంది. ఉదా: మన జాతీయాదాలో మూడవవంతును 100కి 5 గురు ధనికులు అనుభవిస్తున్నారనీ, జనాభాలో 3/5 వ వంతు మంది సాధారణ ప్రజలు మరొక మూడవవంతు జాతీయాదాయాన్ని పొందు

తున్నారనీ; అలాగే పట్టణాలలోని ప్రజలలో రు. 300/- పైబడి సంపాదించేవారు పట్టణ జనాభాలో 1% మాత్రమేననీ, రు. 100/- లోపు సంపాదన గలవారు 86.33% వరకు ఉన్నారని జాతీయ నమూనా పరిశీలన అంచనాలు తెలియజేస్తున్నాయి.

“దేశ జనాభాలో సగంమంది అంటే 18½ కోట్లమంది నెలకు రు. 13 లు మాత్రమే వాడకం వస్తువులకోసం ఖర్చుచేస్తున్నారు. దీనిలో సగభాగం యిళ్లలో పండించుకున్న ఆహారపదార్థాల, యిళ్లలో తయారు చేసుకున్న వస్తువులరూపంలో అనుభవిస్తున్నారు” అని ప్రొఫెసర్ మహాలనోబిస్ “రెండో ప్రణాళిక సూచనల ముసాయిదా” లో వ్రాశారు.

ప్రజల జీవితస్థాయిలో మార్పులేవీ రాలేదనే విషయాన్ని అంగీకరిస్తూ రెండవ ప్రణాళికలో యిలా చెప్పబడింది: “...భారతప్రజల జీవనస్థాయి ప్రపంచంలోకల్లా చాలా తక్కువగా ఉందనేది స్పష్టం. వారు తినే తిండి కనీస పోషకస్థాయికన్నా తక్కువ. 1955-'56 లో ఒక్కొక్క మనిషి సగటున 16 గజాల గుడ్డ వుపయోగించాడు. ఇది యుద్ధానికి పూర్వం వాడినదానికన్నా తక్కువ.”

ఇక గృహవసతుల సమస్య చాలా తీవ్రంగాఉందని అందరికీ తెలుసు. ఉన్న యిళ్ళల్లో సహితం పల్లెలలో నూరింట 34 యిళ్లూ, బస్తీలలో 44 యిళ్లూ కేవలం ఒక గది గలవి మాత్రమే. బస్తీలలోనే 50 లక్షల కుటుంబాలు యిల్లూ వాకిలీలేక అల్లాడుతున్నాయని అంచనాలు తెలియజేస్తున్నాయి.

(3) జాతీయాదాయంలో నూటికి 50 వంతులు వ్యవసాయం నుంచే వస్తూన్నదనీ, పారిశ్రామికాభివృద్ధి చాలా తక్కువనీ కూడా తేలుతూంది. అలాగే మొత్తం పరిశ్రమలనుండి వచ్చే ఆదాయం మొత్తం జాతీయాదాయంలో 17% అయితే, దానిలో కూడా పెద్ద పరిశ్రమల నుండి 10.7%, చిన్న పరిశ్రమలనుండి 66% వస్తూంది. కావున పెద్ద పరిశ్రమలు అభివృద్ధి కాలేదని కూడా తెలుస్తుంది.

మొత్తంమీద తేలుతున్నదేమిటి? మన జాతీయాదాయాన్ని సత్వరమే పెంపొందించుకోవలసియున్నది. అలా చేయనినాడు ప్రజల జీవనస్థాయిని శీఘ్రంగా మెరుగుపరచడం సాధ్యంగాదు. మన ఆర్థిక వ్యవస్థకిదొక పెద్ద సమస్యగా ఉన్నది.

# నిరుద్యోగ సమస్య

మనదేశంలో నిరుద్యోగ సమస్య చాలా తీవ్రంగా వున్నదని అందరూ అంగీకరిస్తున్న విషయమే. ప్రొఫెసర్ మహాలనోబిస్ చెప్పినట్లు యిదొక పెద్ద సామాజిక సమస్యగా తయారైంది. పనులు దొరకక, బ్రతుకు తెరువు కాధారంలేక, కోట్లకొలది ప్రజలు నిరాధారంగా ఉండడం మన సమాజానికే ప్రమాదకరం. నిరుద్యోగం ఫలితంగా ఆత్మహత్యలు, గృహత్యాగాలు, సంసార విచ్ఛేదాలు, వ్యభిచారం, దొంగతనం మొదలగునవి పెంపొందుతున్నాయి.

నిరుద్యోగం వలన కలిగే ఆర్థిక దుష్ఫలితాలు కూడ అనేకం ఉన్నాయి. నిరుద్యోగు లెక్కువగా ఉంటే కార్మికుల జీవన ప్రమాణం తగ్గిపోతుంది. అధిక జీతాలకోసం, పనిపరిస్థితులు మెరుగవడంకోసం వారు సాగించే పోరాటాలలో చిక్కు లెక్కువవుతాయి. అందుచేత నిరుద్యోగ సమస్యను పరిష్కరించేందుకు జరిగేపోరాటం, హెచ్చుజీతాలు, మంచి పని పరిస్థితులకు జరిగే పోరాటంలో భాగంగానే ఉంటుంది. మనదేశంలో పనిచేయగలశక్తి ఉండికూడ కోట్లాది ప్రజలు పనిలేకుండా ఉండడం వలన జాతీయాదాయాన్ని పెంచుకోలేకపోతున్నాం. పనిచేస్తున్న ప్రతిమనిషీ యేడాదికి రు. 670 ల విలువగల ఉత్పత్తి చేస్తున్నాడని జాతీయాదాయ పరిశీలనాసంఘ నివేదిక చెప్పుతూఉన్నది. దానినిబట్టిచూస్తే యీనాడున్న సాంకేతిక పరిజ్ఞానంలోనే నిరుద్యోగులుగాను, పాక్షిక నిరుద్యోగులుగా నున్న వారందరికీ పూర్తిగా పని దొరికినట్లయితే యేడాదికి దాదాపు రు. 3551 కోట్ల విలువగల ఉత్పత్తిచేసి ఉండేవారని అంచనా వేయబడింది. ప్రస్తుతం ఆ మేరకు మనదేశం నష్టపడుతూ ఉన్నదన్నమాట.

## నిరుద్యోగానికి మూలకారణం

పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలలో నిరుద్యోగానికి, మన దేశంలోని నిరుద్యోగానికి చాలా తేడాఉన్నది. పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలలో నిరుద్యోగానికి కారణం, ఉత్పత్తిలో అరాజకత్వం మాత్రమే. కాని మన దేశంలో నిరుద్యోగం బ్రిటిష్ వలసపాలన ఫలితంగా యేర్పడింది. బ్రిటిష్ వారు 19 వ శతాబ్దంలో పారంపర్యంగా వస్తున్న మన దేశీయ పరిశ్రమ

లను నిర్మూలించారు. ఆధునిక యంత్రపరిశ్రమలు అభివృద్ధి చెందకుండా అడ్డుపడ్డారు. తత్ఫలితంగా మనదేశంలో బ్రిటిష్ పరిపాలన స్థిరపడిన తర్వాత నూరేండ్లలోను యేనాడూ మన ప్రజలందరకు పూర్తిగా పనిఉన్న రోజులేదు.

రానురాను అధికభాగం జనాభా వ్యవసాయంమీద ఆధారపడ వలసి వచ్చింది. జనాభా పెరుగుదల కనుగుణ్యంగా సాగుభూమి పెరగక పోవడంతో సమస్య మరింత తీవ్రరూపం దాల్చింది. ఒక వైపున వ్యవ సాయంమీద ఆధారపడే జనాభా పెరుగుతూఉంటే రెండవవైపున ఒక్కొక్క మనిషికి సగటున లభ్యమయ్యే పంటభూమి సాపేక్షికంగా ఏవిధంగా తగ్గుతూ వచ్చిందో యీ క్రింది టేబిల్సు తెలియజేస్తాయి.

వ్యవసాయంమీద ఆధారపడే జనాభా పెరుగుదల

| 1891 | 1911 | 1931 | 1951 |
|---|---|---|---|
| 61.6% | 71% | 73% | 70% |

ఒక్కొక్క మనిషికి సగటున లభ్యమయ్యే పంటభూమి

| వివరాలు | 1921 | 1951 |
|---|---|---|
| సాగుభూమి (ఎకరాలలో) | 1.11 | 0.84 |
| నీటి వసతులున్న భూమి (డిటో) | 0.18 | 0.14 |
| రెండు పంటలుపండే భూమి (డిటో) | 0.13 | 0.10 |

ఇదే దశలో పరిశ్రమలమీద ఆధారపడే జనాభా యీ క్రింది విధంగా తగ్గింది.

| | |
|---|---|
| 1911 లో | 11.2% |
| 1951 లో | 10.6% |

ఈవిధంగా మనదేశంలో నిరుద్యోగ సమస్యకు మన ఆర్థికవిధానంలో యేర్పడిన ప్రతిష్టంభన, వ్యవసాయంమీద ఒత్తిడి – యివే మూలకారణాలు.

మనదేశంలోని నిరుద్యోగంయొక్క స్వరూప, స్వభావాలేమిటి, ఎక్క డెక్కడ యేవిధంగా ఉన్నది అనేదానిని పరిశీలించవలసియున్నది.

## పట్టణాలలో నిరుద్యోగం

ప్రభుత్వం నిరుద్యోగ నమూనా పరిశీలనకు నియమించిన సంఘం వారు 1955 సెప్టెంబర్‌లో పట్టణాలకు సంబంధించిన నిరుద్యోగాన్ని గూర్చి ఒక పరిశీలనా నివేదికను ప్రకటించారు. ఆ రిపోర్టు ప్రకారం దేశం మొత్తంమీద పట్టణాలలో నిరుద్యోగుల సంఖ్య 22 లక్షల 40 వేలుంటుందని, మామూలు పనిలో నాలుగోవంతుకూడా పనిదొరకనివారు మరొక 27 లక్షల 40 వేలమంది ఉంటారని, అంటే మొత్తం రమారమి 50 లక్ష లుంటారని అంచనా వేయబడింది.

## విద్యావంతుల్లో నిరుద్యోగం

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమకు కావలసిన గుమాస్తాలు వగైరా ఉద్యోగబృందాన్ని సృష్టించుకొనుటకు వీలుగా యేర్పరచిన విద్యావిధానమే విద్యావంతుల్లో నిరుద్యోగానికి మూలకారణం. ఈనాటికి కూడా అదే విద్యావ్యవస్థ కొనసాగుతూ ఉన్నందువలనను, నానాటికీ చదివేవారి సంఖ్య పెరుగుతూ ఉన్నందువలనను ఈ సమస్య తీవ్రతరమౌతూంది. మన విద్యావంతులకు సాంకేతిక పరిజ్ఞానం లేకపోవడంవలన వారు యంత్రాగారాలలోను, పొలాలలోను పని చేయలేక పోతున్నారు.

ప్రణాళికాసంఘం నియమించిన అధ్యయన సంఘం 1956 లో నివేదించిన రిపోర్టు ప్రకారం 1955 నాటికున్న విద్యావంతుల సంఖ్య యీ క్రింది విధంగా ఉంటుందని అంచనా వేసింది.

| | | |
|---|---|---|
| మెట్రిక్యులేట్లు | ... | 30,46,000 |
| ఇంటర్‌మీడియట్లు | ... | 5,25,000 |
| గ్రాడ్యుయేట్లు | ... | 15,28,000 |
| మొత్తం | | 50,99,000 |

వీరిలో రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో 5,50,000 మంది నిరుద్యోగులుగా ఉన్నారని తేల్చబడింది. రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క 5 సంవత్సరాలకాలంలో కొత్తగా రంగంలోకివచ్చి, ఉద్యోగం చూపించవలసిన విద్యావంతులు మరొక 14,50,000 మంది తయారవుతారని,

అంటే ప్రణాళిక ఆఖరునాటికి 20 లక్షలమంది నిరుద్యోగులైన విద్యావంతులు ఉండగలరని అంచనా వేయబడింది.

## పల్లెసీమలలో నిరుద్యోగం

వ్యవసాయకూలీలలో నిరుద్యోగాన్ని గురించి అధ్యయనం చేసిన వ్యవసాయకూలీల విచారణసంఘ నివేదిక ప్రకారం పనిచేసే ప్రాయంగల వారు 3 కోట్ల 54 లక్షలమంది ఉంటే, వారిలో 56 లక్షల 60 వేలమంది (16%) పూర్తి నిరుద్యోగులని, మిగిలిన 84% సంవత్సరంలో 49 రోజులు పూర్తి నిరుద్యోగులుగా ఉంటున్నారని తేల్చబడింది. పూర్తి నిరుద్యోగులుగా ఉన్న యీ 49 రోజులను మనుష్యుల సంఖ్యకు మారిస్తే దాదాపు 59 లక్షల 11 వేలమంది అవుతారు. అంటే వ్యవసాయకూలీలలో మొత్తం నిరుద్యోగుల సంఖ్య 1 కోటి 11 లక్షల 17 వేలమంది వరకు ఉంటారు. వీరుగాక పల్లెలలో పూర్తిగా నిరుద్యోగులుగాఉండే యితర జనాభా మరొక 3½ కోట్లు ఉండవచ్చునని అంచనా. ప్లానింగ్ కమిషన్‌కు శ్రీ బి. యన్. దాతార్ సమర్పించిన నివేదిక ప్రకారం పల్లెసీమలలో పనిచేసే ప్రాయంగల 12 కోట్ల 9 లక్షల జనాభాలో దాదాపు 46% అంటే 4 కోట్ల 80 లక్షలమంది నిరుద్యోగులుంటారని లెక్కగట్టబడింది.

పై వివరాలనుబట్టి దేశం మొత్తంమీద పల్లెలలోనూ, పట్టణాలలోనూ ఉండే పూర్తి నిరుద్యోగుల సంఖ్య 5 కోట్ల 80 లక్షలవరకూ ఉంటుందని తేలుతుంది.

మన ప్రభుత్వం యీ సమస్యను చాలా తక్కువ అంచనా వేస్తున్నట్లు కన్పడుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక ఆఖరుకు 153 లక్షలమంది మాత్రమే నిరుద్యోగులుంటారనీ, వారిలో దాదాపు 80 లక్షలమందికి మాత్రమే ఉద్యోగాలు చూపించవచ్చుననీ అంచనా వేసింది. దీనినిబట్టి రెండవ ప్రణాళిక ఆఖరుకుకూడా ఉద్యోగ పరిస్థితిలో పెద్ద మార్పు రాదనేది స్పష్టం. ఎక్కడైనా 5 సం॥ కాలంలో యింత పెద్ద నిరుద్యోగాన్ని నిర్మూలించడం సాధ్యంకానిమాట నిజమే. కాని సత్వర, సర్వతోముఖ పారిశ్రామికాభివృద్ధి జరిగి, వ్యవసాయంనుండి గనులకు, ఫ్యాక్టరీలకు, వర్తక వాణిజ్యాలకు అత్యధిక సంఖ్య పనివారిని పంపగలిగినట్లయితే యీ సమస్య పరిష్కార మౌతుంది.

## విదేశ దోపిడీ సమస్య

స్వాతంత్ర్యం వచ్చినా బ్రిటిష్‌వారి దోపిడీ యథాతథంగా కొన సాగుతూనే ఉన్నది. తేయాకు, బొగ్గు, జనపనార, ఇంజనీరింగ్, నూనె, విదేశీవ్యాపారం, బాంకింగ్, సాధారణ భీమా మొ॥ ప్రధాన పరిశ్రమలన్నీ యీనాటికీ బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లోనే ఉన్నాయి. పైగా బ్రిటిష్ పెట్టుబడి అధనంగా కూడా మనదేశంలో ప్రవేశించింది. కంపెనీల లాభాలు, ఓడ కేవులు, వాణిజ్యం వ్యవహారాలలోని లాభాలద్వారా రు. 125 కోట్లు, ఇవిగాక డివిడెండ్లు, వడ్డీలు వ్యవహారాల రూపంలో మరొక రు. 30 కోట్లు, మొత్తం రు. 155 కోట్లు ఏటేటా బ్రిటిషువారు దోచుకుపోతూనే ఉన్నారు. ఈ దోపిడీ నరికట్టకుండా ఉన్నంతకాలం మన ఆర్థికాభివృద్ధి కుంటుపడుతూనే ఉంటుందనేది స్పష్టం.

## వ్యవసాయ దుస్థితి

ఇక మన వ్యవసాయరంగంలో భూస్వామ్య వ్యవస్థయొక్క అవశేషాలు, ఆ సంబంధాలు యింకా రద్దుకానేలేదు. ప్రభుత్వం కొన్ని భూసంస్కరణలు ప్రవేశపెట్టినా భూమిదున్నేవాని చేతికిరాలేదు. ఈమధ్యనే దేశంలో నమూనా పరిశీలన ఒకటి జరిగింది. దానిప్రకారం నూటికి 22 కుటుంబాలవారికి భూమిఅనేదే లేదనితేలింది. నూటికి 75 కుటుంబాలవారికి 4 ఎకరాలలోపు భూమి చొప్పున మొత్తం భూమిలో 16 శాతం మాత్రమే ఉన్నది. మిగిలిన నూరింట ముగ్గురి చేతులలో (25 ఎకరాలకు పైబడి భూమిగలవారు) మొత్తం భూమిలో 31% భూమి ఉన్నది.

మనదేశంలో సాగుకులాయకైన భూమి 46 కోట్ల, 70 లక్షల ఎకరాలుండగా దీనిలో 1956 నాటికికూడా 35 కోట్ల ఎకరాలు మాత్రమే దుక్కిలో ఉన్నది. తిరిగి దీనిలో సాగుభూమి 20% మాత్రమే. ఆహార స్వయంసమృద్ధి యింతవరకు సాధించబడలేదని, సంవత్సరానికి కొన్ని లక్షల టన్నుల ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోబడుతున్నాయని అందరకూ తెలిసినదే.

రైతులపైన ఋణభారం పెరుగుతూనే ఉన్నది. పాత అప్పులు రు. 900 కోట్లకుతోడు 1951-'56 ల మధ్య మరొక రు. 750 కోట్లు మన రైతాంగం అప్పు చేయవలసివచ్చింది.

పై సమస్యలేగాక ప్రజల విద్యా, విజ్ఞానాలకు సంబంధించిన సమస్యలు, వైద్య సదుపాయాల సమస్య వగైరాలను పరిష్కరించుకోవలసి యున్నది.

ఇవీ నేడు మన ఆర్థికవ్యవస్థ నెదుర్కొంటున్న ముఖ్య సమస్యలు. ఈ సమస్యలను పరిష్కరించుకొనేందుకు ఒకే ఒక మార్గమున్నది. మన ఆర్థిక పరాధీనతకు స్వస్తిచెప్పి, మన బడుగు పరిస్థితికిగల మూలకారణాలను తొలగించాలి. స్వతంత్ర ఆర్థిక వ్యవస్థను నిర్మించి, సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించుకోవలసియున్నది.



# పారిశ్రామికాభివృద్ధి

మన దేశ సంపదను, జాతీయాదాయాన్ని పెంచాలన్నా, మన ప్రజల జీవనస్థాయి పెరగాలన్నా, నిరుద్యోగసమస్యను పరిష్కరించుకోవాలన్నా సత్వర పారిశ్రామికాభివృద్ధి జరగవలసియుంటుంది. ఈనాడు మనదేశంలో పారిశ్రామికాభివృద్ధి యేవిధంగా జరుగుతూంది, దానియొక్క స్వరూప స్వభావా లేమిటి, పైన వివరించిన సమస్యలను అది ఎంతవరకు పరిష్కరించగలుగుతుంది అనేవాటిని పరిశీలించుదాం.

## 1. స్వాతంత్ర్యానికి పూర్వం మన పరిశ్రమలు

బ్రిటిష్ పాలకులు మనదేశంలో పారిశ్రామికాభివృద్ధిని ఆటంకపరిచారనీ, కేవలం తమ దేశంలోని పరిశ్రమల కవసరమైన ముడి పదార్థాల నుత్పత్తి చేయుటకు, వాటిని రవాణా చేయుటకు అవసరమైన చిన్న చిన్న పరిశ్రమలు మాత్రమే అభివృద్ధి యగుటకు అవకాశమిచ్చారని, పరాయి పాలకుల నిర్బంధాలను తట్టుకొని, అనుకూల పరిస్థితుల నుపయోగించుకొని (మొదటి, రెండవ ప్రపంచయుద్ధాలు) వాడకపు సరుకుల నుత్పత్తిచేసే దేశీయ పరిశ్రమలు కొన్ని మాత్రమే నెలకొల్పబడ్డాయనీ పైన చూచాము.

స్వాతంత్ర్యానికి పూర్వం మనదేశంలో నెలకొల్పబడిన పరిశ్రమలు, వాటి ఉత్పత్తి స్థాయి యీ క్రింద యివ్వబడ్డాయి.

1. బట్టల మిల్లులు :

ప్రధాన జాతీయ పరిశ్రమ. పెట్టుబడి మొత్తం 105 కోట్లు. కార్మికుల సంఖ్య 8 లక్షలు. ప్రత్తి నుత్పత్తిచేసే రైతులతో కలిపి యీ పరిశ్రమపైన ఆధారపడేవారు 1 కోటి 50 లక్షలుంటారు. 1954-55లో 504 కోట్ల 60 లక్షల గజాల గుడ్డ, 157 కోట్ల 7 లక్షల పౌనుల నూలు ఉత్పత్తి అయింది. 1954 లో 56 కోట్ల రూపాయల విలువగల 77 కోట్ల 90 లక్షల గజాలబట్ట యెగుమతి చేయబడింది.

2. జూట్ మిల్లులు :

మొత్తం 112. పెట్టుబడి 80 కోట్ల రూపాయలు. కార్మికులు 3 లక్షలు. ఎక్కువభాగం ఉత్పత్తి యెగుమతిచేయబడుతూ వుంది. 1955 లో 119 కోట్ల 55 లక్షల రూపాయల విలువగల 7 లక్షల 43 వేల టన్నుల ఉత్పత్తి జరిగింది.

3. ఇనుము, ఉక్కు పరిశ్రమలు :

సంవత్సరానికి 10 లక్షల టన్నుల ఇనుము, ఉక్కు ఉత్పత్తి చేయగల తాతా ఇనుము, ఉక్కు కంపెనీ, 2 లక్షల 50 వేల టన్నుల నుత్పత్తి చేయగల భారత ఇనుము ఉక్కు కంపెనీ, 25 వేల టన్నుల నుత్పత్తి చేయగల మైసూరు ఇనుము ఉక్కు కంపెనీ లున్నాయి. వీటిలో మొత్తం పెట్టుబడి 61 కోట్ల రూపాయలు. కార్మికులు 60 వేలమంది.

4. పంచదార పరిశ్రమ :

పెట్టుబడి 41 కోట్ల రూపాయలు. కార్మికులు దాదాపు లక్షమంది. 1955-'56 లో 17 లక్షల టన్నుల పంచదార ఉత్పత్తి అయింది. ఇంకా మనం దాదాపు 20 లక్షల టన్నుల పంచదార యేటా దిగుమతి చేసుకోవలసి వస్తూంది.

5. కాగితపు పరిశ్రమ :

19 మిల్లులు; 1955 లో ఉత్పత్తి 1 లక్షా 69 వేల టన్నుల కాగితము, కాగితపు అట్టలు.

6. సిమెంటు పరిశ్రమ :

24 ఫ్యాక్టరీలు. పెట్టుబడి రు. 56 లక్షలు. 1954 లో 44 లక్షల టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయబడింది.

7. అగ్గిపెట్టెల పరిశ్రమ :

1955 లో 3 కోట్ల 11 లక్షల గ్రోసుల అగ్గిపెట్టెలు తయారుచేయబడ్డాయి.

8. భారీరసాయనిక పరిశ్రమ :

సల్ఫ్యూరిక్ ఆసిడ్, కాస్టిక్ సోడా, సోడాయాష్‌ల నుత్పత్తిచేసే పరిశ్రమలను రెండవ ప్రపంచయుద్ధానంతరం ప్రభుత్వమే నెలకొల్పింది.

1955-'56 లో 1 లక్ష 75 వేల టన్నుల సల్ఫ్యూరిక్ ఏసిడ్, 36 వేల టన్నుల కాస్టిక్‌సోడా, 80 వేల టన్నుల సోడాయాష్ ఉత్పత్తి చేయబడ్డాయి.

**9. గ్లాస్ పరిశ్రమ :**

సంవత్సరానికి 8-10 కోట్ల రూపాయల విలువగల గ్లాసు ఉత్పత్తి అవుతూ ఉంది.

**10. తోళ్ళ పరిశ్రమ :**

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యీ పరిశ్రమ బాగా విస్తరించింది.

ఇవిగాక రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రారంభించబడి క్రమంగా అభివృద్ధి అవుతున్న పరిశ్రమలు కొన్ని ఉన్నాయి. ఫిలిం పరిశ్రమ, వనస్పతి పరిశ్రమ, ఉన్ని బట్టల పరిశ్రమ, సబ్బులు, రంగులు, వార్నిషులు, సిగరెట్లు, రబ్బరు వస్తువులు, ప్లాస్టిక్ వస్తువులు వగైరా పరిశ్రమలు.

1947 కు పూర్వం ప్రభుత్వ రంగంలో (1) రైల్వేలు. (2) పోస్టు టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు. (3) పోస్టుట్రస్టు. (4) మందుగుండు, విమానాల ఫ్యాక్టరీలు (5) రిజర్వు బ్యాంకు ఉంటూండేవి.

## 2. స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వ పారిశ్రామిక విధానం

కేంద్ర ప్రభుత్వం మనదేశంలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థను (Mixed Economy) నిర్మించ దలచినట్లు ప్రకటించింది. దీని ప్రకారం కేంద్ర అధికారంక్రింద నిర్ణీత పద్ధతిలో అభివృద్ధి సాధించబడుతుందని, ప్రభుత్వ, ప్రయివేట్ రంగాలు రెండూ ఒకదాని సరసన మరొకటి పరస్పర సమన్వయంతో నడుస్తుంటాయని, "ప్రయివేట్ పరిశ్రమలు నూతన బాధ్యతలను స్వీకరించి ప్రజలకోసం పనిచేసినంత మేరకు మనగలుగుతా"యని ప్రభుత్వం ప్రకటించింది.

పై ప్రకటన కనుగుణ్యంగానే 1948 ఏప్రిల్ 6 వ తేదీన భారత ప్రభుత్వం తన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించింది. దానిప్రకారం పరిశ్రమలు నాలుగు గ్రూపులుగా విభజించబడ్డాయి.

(1) పూర్తి ప్రభుత్వ రంగం: రైల్వేలు, ఆయుధాలు, మందుగుండు పరిశ్రమ, అణుశక్తి పరిశ్రమ. (2) ప్రభుత్వ పెత్తనం క్రింద నడిచే రంగం (Government Controlled Sphere): ఇనుము, ఉక్కు, బొగ్గు, విమానాల ఉత్పత్తి, నౌకా నిర్మాణం వగైరా పరిశ్రమలు. వీటిలో యికముందు నిర్మించబోయే పరిశ్రమలను ప్రభుత్వమే నెలకొల్పుతుంది. ఇప్పటికే ప్రయివేట్ రంగంలో నిర్మాణమై నడుస్తున్న పరిశ్రమలు మరొక 10 సం॥ వరకు వారిద్వారానే ప్రభుత్వ ఖాయిదాలో నడుస్తాంటాయి. 10 సం॥ తర్వాత తిరిగి పరిశీలించబడుతుంది. (3) ప్రభుత్వ విధానాలకు, పర్యవేక్షణకు లోబడి నడిచే పరిశ్రమలు (Industries subject to state regulation and control). వీటిని ప్రయివేట్ పెట్టుబడిగారులే నిర్వహిస్తారు. వీటిలో ముఖ్యమైనవి, భారీ రసాయనిక పదార్థాలు, పంచదార, నూలు, ఉన్ని బట్టలు, సిమెంటు, కాగితం, ఉప్పు, యంత్రపరికరాలు మొదలగు పరిశ్రమలు. (4) మిగిలిన పరిశ్రమలన్నీ పూర్తిగా ప్రయివేట్ రంగంలో ప్రభుత్వ సాధారణ పర్యవేక్షణకు లోబడి పనిచేస్తాయి. సరిగ్గా నిర్వహించబడని పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవచ్చునని కూడా సూచించబడింది.

ఈ విధానాన్ననుసరించి 1951 లో ప్రభుత్వం పరిశ్రమల (అభివృద్ధి, సక్రమ నిర్వహణ) చట్టాన్ని తీసుకువచ్చింది. ప్రస్తుత పరిశ్రమలన్నీ రిజిస్టరు జేయించుకోవాలని, నూతన పరిశ్రమలు ప్రభుత్వ లైసెన్సును పొంది నిర్దేశిత స్థలంలో, పరిమాణంలో నిర్మించబడాలని, సక్రమంగా నిర్వహించబడని పరిశ్రమల వ్యవహారాలను పరిశీలించుటకు, అవసరమైతే స్వాధీన పరచుకొనుటకు ప్రభుత్వానికి హక్కు గలదని యీ చట్టంలో చెప్పబడింది. ఒక కేంద్ర పరిశ్రమల సలహాసంఘము, ఒక లైసెన్సింగ్ కమిటీ యీ చట్టాన్ని అమలు జరిపేందుకు 1952 లో నియమించబడ్డాయి. కొన్ని ముఖ్య పరిశ్రమలకు అభివృద్ధి సమితులుకూడా ఏర్పరచబడ్డాయి.

## నూతన పారిశ్రామిక విధానం :

రెండవ పంచవర్ష ప్రణాళిక నామోదించిన పిమ్మట 1956 ఆగస్టులో కేంద్ర ప్రభుత్వం తన నూతన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించింది. ఆ విధాన ప్రకటనయొక్క ఉద్దేశాలను వివరిస్తూ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యిలా చెప్పబడింది.

"1948 సంవత్సరంలో పారిశ్రామికవిధాన తీర్మానం ఆమోదించ బడిన తర్వాత దేశంలో ముఖ్యమైన మార్పులు కొన్ని సంభవించాయి. సక్రమపద్ధతుల ప్రాతిపదికగా ప్రణాళికల నిర్వహణ ప్రారంభంగావడం, దేశంలో సోషలిస్టుసమాజ స్థాపన లక్ష్యమునకు పార్లమెంటు ఆమోదించడం వంటి ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. ఈ సంఘటనల దృష్ట్యా 1948 వ సంవత్సరపు పారిశ్రామిక విధానాన్ని సమీక్షించిన మీదట ప్రధానమంత్రి నూతన పారిశ్రామికవిధాన తీర్మానము పార్లమెంటులో ప్రవేశ పెట్టారు. దేశ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమంలో ప్రభుత్వం ప్రముఖ పాత్ర వహించాలని యీ నూతన విధానం నిర్దేశిస్తున్నది. ప్రభుత్వరంగం విస్తరించి ప్రాతిపదిక పరిశ్రమలు, తదితర కీలక పరిశ్రమలు ప్రభుత్వ రంగ మందు చేర్చాలనికూడ యీ తీర్మానం నిర్దేశిస్తున్నది. ఇతర పరిశ్రమలలో భారీయెత్తున పెట్టుబడి అవసరమై, ప్రైవేట్ సంస్థల తాహతుకు మించిన పరిశ్రమల నిర్వహణ బాధ్యతను కూడా ప్రభుత్వమే స్వీకరిస్తుంది." (ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సంగ్రహపాఠం, తెలుగుకాపీ, పుట 11, గీతలు మావి).

ఈ తీర్మానం ప్రకారం పరిశ్రమలు పూర్తి ప్రభుత్వరంగం - ఉమ్మడిరంగం - ప్రైవేట్ రంగం అని మూడు రకాలుగా విభజించ బడ్డాయి.

పూర్తి ప్రభుత్వ రంగం:

ఆయుధాలు, మందుగుండు పరిశ్రమలు; తదితర రక్షణశాఖ పరిక రాల పరిశ్రమలు; అణుశక్తి; యినుము; ఉక్కు: ఇనుము, ఉక్కుల భారీ పోత వస్తువులు; ఇనుము, ఉక్కుల ఉత్పత్తికి, ఖనిజముల త్రవ్వకానికి, యంత్ర పరికరాల తయారీకి అవసరమైన భారీయంత్ర పరిశ్రమలు; కేంద్ర ప్రభుత్వ నిర్దేశితమైన తదితర కీలక పరిశ్రమలు; హైడ్రాలిక్, స్టీమ్‌టర్బైన్ పరిశ్రమలు, భారీ విద్యుత్ పరికరాలు; బొగ్గు, లిగ్నైట్, ఖనిజ తైలములు; ఇనుము, మాంగనీస్, క్రోమియం, జిప్సం, గంధకము, బంగారం, వజ్ర ముల గనుల త్రవ్వకం; రాగి, సీసం, జింకు, తగరం, మాలిబ్డినం గనుల త్రవ్వకము, వాటి ప్రోసెసింగ్, అణుశక్తి ఉత్పత్తి కవసరమైన ఖనిజములు,

విమానములు; విమాన రవాణా, రైల్వే రవాణా; నౌకా నిర్మాణము; టెలిఫోనులు; టెలిఫోన్ కేబుళ్ళు, టెలిగ్రాఫ్, వైర్లెస్, రేడియో పరికరాలు; విద్యుచ్ఛక్తి తయారీ, పంపకం.

ఉమ్మడి రంగం :

పైన చెప్పినవిగాక మిగిలిన ఖనిజములు; అల్యూమినియం; పైన చెప్పినవిగాక మిగిలిన నాన్ ఫెర్రస్ లోహములు; యంత్ర పరికరాలు; లోహ మిశ్రమములు; ఉక్కు పరికరాలు; ఔషధములు, అద్దకపు రంగులు, ప్లాస్టిక్ పరికరాలు, క్రిమిసంహారక మందులు, తదితర అత్యవసర ఔషధాలు, ఎరువులు, సింథటిక్ రబ్బర్, బొగ్గుకర్బనీకరణం, కెమికల్ పల్ప్, రోడ్డు రవాణా, సముద్రరవాణాలు.

ఇవి క్రమక్రమంగా ప్రభుత్వ యాజమాన్యంక్రిందికి వస్తాయి. కొత్తగా పెట్టదలచుకున్నవి ప్రభుత్వమే పెడుతుంది. కాని ప్రైవేట్ పెట్టుబడికి కూడా ప్రోత్సాహ మివ్వబడవచ్చు.

ప్రయివేట్ రంగం :

పైన ఉదహరించినవి మినహా మిగతావాని నిర్మాణం, నిర్వహణ, అభివృద్ధి ప్రయివేట్ సంస్థలకు వదలివేయబడ్డాయి.

ప్రభుత్వ రంగంలో 1948 తీర్మానంలోని పరిశ్రమలతోపాటు అదనంగా 7 కొత్త కీలకపరిశ్రమలను చేర్చడం హర్షించదగినదే. అలాగే ఉమ్మడి రంగంలో కొత్తపరిశ్రమలను సాధ్యమైనంతవరకు ప్రభుత్వమే నెలకొల్పుతుందని చెప్పడంకూడా హర్షించదగినదే. అలాచేస్తే అల్యూమినియం, యంత్రపరికరాలలో వరుసగా గుత్తఆధిపత్యం కెనడియన్ కంపెనీ, కిర్లోస్కర్ కంపెనీ వగైరాల ప్రాబల్యం కొంతవరకు తగ్గుతుంది. అదేవిధంగా రోడ్డురవాణా, సముద్ర రవాణాలలోనూ, ఎరువుల ఉత్పత్తిలోనూ ప్రభుత్వ రంగం విస్తరించడం కూడా హర్షిచదగినదే.

సోషలిస్టు సమాజ స్థాపనాలక్ష్యాన్ని ఆమోదించిన తర్వాత యీ తీర్మానం చేయబడింది. ప్రభుత్వరంగం విస్తరించి, ప్రాతిపదిక, తదితర కీలక పరిశ్రమలు ప్రభుత్వరంగమందు చేర్చాలనికూడా నిర్దేశిస్తున్నది.

కాని తీర్మానంలో కొన్ని భాగాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఇందుకు భిన్నంగా కొన్ని నిర్ణయాలు జరిగినట్లు తేలుతుంది. (1) 1948 తీర్మా

నంలో బొగ్గు, యినుము, ఉక్కు, చమురు మొదలైన ప్రయివేట్ పరిశ్రమలను ప్రభుత్వ ఖాయిదాలో ఉంచి 10 సంవత్సరాల తర్వాత వాటిని గురించి సమీక్షింపబడుతుందని చెప్పబడింది. కాని యీ నూతన తీర్మానంలో ఆ ప్రసక్తే లేకపోవడం గమనార్హం. అంతేగాక యిదివరకే ప్రయివేట్ రంగంలో ఉన్నవాటిని వదిలివేసి కొత్తవాటిని మాత్రమే ప్రభుత్వం నెలకొల్పుతుందని చెప్పబడింది. కావున ప్రభుత్వం యీ కీలక ప్రయివేట్ పరిశ్రమలను అంటుకోదలచుకోలేదని తేలుతుంది. (2) 1948 తీర్మానంలో సక్రమంగా నిర్వహించబడని ఏ పరిశ్రమనైనా స్వాధీనం చేసుకునే హక్కు ప్రభుత్వానికున్నదని ప్రకటించబడింది. నూతన తీర్మానంలో ఆ విషయాన్ని పునరుద్ఘాటించకుండా వదిలివేయడంకూడ గమనించదగినది.

వీటినిబట్టి ప్రభుత్వం ప్రయివేట్ పెట్టుబడిదారులకు, యిప్పట్లో మొదటి జాబితాలో చేర్చబడినప్పటికి, ప్రయివేట్ రంగంలోనున్న కీలక పరిశ్రమలను జాతీయం చేయబోవడంలేదని హామీ యివ్వబడింది. ఈ పరిశ్రమలకు ప్రభుత్వ రంగంతోపాటు సమానహోదా కల్పించబడింది.

ఇదేసందర్భంలో ప్రయివేట్ పెట్టుబడికి యిస్తున్న యీ సౌకర్యాన్ని కప్పిపుచ్చుకునేందుకు ప్రభుత్వం పాతబడిపోయి తుక్కుగానున్న (Junk) యీ పరిశ్రమలను స్వాధీనం చేసుకుని లాభంలేదనే వాదనను తెస్తూంది. ఈ "తుక్కు" నుండే ప్రయివేట్ పెట్టుబడిదారులు లక్షలాది రూపాయల లాభాలు సంపాదిస్తున్నారు. నూతన పెట్టుబడులు సమకూర్చుకుంటున్నారు. పైగా యీ "తుక్కు"కు నష్టపరిహారం క్రింద తక్కువే యివ్వవచ్చు. నష్టపరిహారాన్ని వీటినుండి వచ్చే ఆదాయంలోనే నెమ్మదిగా చెల్లించవచ్చును. అందువలన యీ వాదనలో పసలేదని స్పష్టమవుతుంది.

మరొకవిషయం. ఈ తీర్మానం ప్రయివేట్ రంగంపైన ప్రభుత్వం యొక్క పర్యవేక్షణను గురించి పునరుద్ఘాటించినా రెండవ వైపున ప్రయివేట్ రంగంలోని పరిశ్రమల అభివృద్ధికవసరమైన సహాయమంతా (రవాణా సౌకర్యాల అభివృద్ధి, విద్యుత్సరఫరా, తదితర ఆర్థిక సౌకర్యాలు) యివ్వబడుతూందనికూడా హామీ యిస్తూంది.

ఈ విధంగా ప్రభుత్వం ప్రకటించిన ఆశయాలు ఆచరణలో ప్రయివేట్ పెట్టుబడికియిస్తున్న హామీలు, రక్షణలు, సౌకర్యాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి.

## 3. పారిశ్రామికాభివృద్ధి కృషి - పంచవర్ష ప్రణాళికలు

పైన చెప్పిన ఆర్థిక విధానాల చట్రంలో భారతప్రభుత్వం నిర్ణీత పథకాలు, ప్రణాళికల ననుసరించి పారిశ్రామికాభివృద్ధిని సాధించ పూను కుంది. మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తయింది. రెండో పంచవర్ష ప్రణాళిక నడుస్తూంది.

**తొలి ప్రణాళికలో :**

ప్రభుత్వ రంగంలో పరిశ్రమల అభివృద్ధికి రూ. 101 కోట్లు, ప్రయివేట్ రంగంలో రూ. 233 కోట్లు కేటాయించబడ్డాయి. కాని ఆచరణలో ప్రభుత్వ రంగంలో 57 కోట్లు, ప్రయివేట్ రంగంలో 220 కోట్లు మాత్రమే ఖర్చుచేయబడ్డాయి.

ప్రభుత్వ రంగంలో యీ క్రింది పరిశ్రమలను అభివృద్ధిచేయడంగాని, కొత్తగా నెలకొల్పడంగాని జరిగింది.

కేంద్ర ప్రభుత్వం నెలకొల్పినవి : సింద్రీ యెరువుల ఫ్యాక్టరీ, చిత్తరంజన్ రైల్వే యింజన్ల కర్మాగారం, రైల్వే వాగన్ల కర్మాగారం, హిందూస్థాన్ యంత్ర పరికరాలు, భారత్ రేర్ ఎర్త్స ఫ్యాక్టరీ, భారత్ ఎలక్ట్రానిక్స్ కంపెనీ, హిందూస్థాన్ కేబుల్స్, నేషనల్ యిన్స్ట్రుమెంట్స ఫ్యాక్టరీ, పెన్‌సిలిన్ ఫ్యాక్టరీ, డి. డి. టి. ఫ్యాక్టరీ, ప్రభుత్వ గృహ నిర్మాణ ఫ్యాక్టరీ, యంత్ర పరికరాల ప్రోటోటైప్ ఫ్యాక్టరీ, నహాన్ ఫౌండ్రీ.

రాష్ట్ర ప్రభుత్వాలక్రింద నున్నవి : ఉత్తర ప్రదేశ్ సిమెంట్ ఫ్యాక్టరీ, మధ్య ప్రదేశ్‌లో నేషా మిల్లులు, బీహార్‌లో సూపర్ ఫాస్ఫేట్ ఫ్యాక్టరీ, ఆంధ్ర ప్రదేశ్‌లో సిర్‌సిల్కు ఫ్యాక్టరీ, సిర్‌పూర్ కాగితపు మిల్లు, పశ్చిమ బెంగాల్‌లో కోక్ ఓవెన్‌కమ్‌గాస్ ప్రాజెక్టు.

ప్రయివేట్ రంగంలో - ఈ క్రింది పరిశ్రమలను అభివృద్ధిచేయడంగాని, కొత్తగా నిర్మించడంగాని జరిగింది. మోటారుకార్లను సమకూర్చడం, డీజెల్ యింజన్ల ఉత్పత్తి, పవర్‌పంపుల ఉత్పత్తి, అల్యూమినియం పరిశ్రమ, జౌళిమిల్లు యంత్రోత్పత్తి, గ్రేడెడ్ యంత్రపరికరాలు, బాల్ అండ్ రోలర్ బేరింగులు, బైసికిళ్ళు, కుట్టుయంత్రాలు, హరికేన్ లైట్లు వగైరా

తేలిక యింజనీరింగ్ పరిశ్రమలు, పంకాలు, తీగెలు, లాంపులు, మోటారులు, ట్రాన్స్ ఫార్మర్లు, డ్రైస్టోరేజి బాటరీలు మొదలైన విద్యుత్ పరికరాలు, రేడియో రిసీవర్లు, భారీ రసాయనిక పదార్థాలు, యెరువులు, ఔషధాలు, రేయాన్ ఫిలమెంట్లు, ప్లయవుడ్ ప్లైట్లు, రేజర్ బ్లేడ్లు, ఎలెక్ట్రిక్ మీటర్లు, రెఫ్రిజిరేటర్లు, ఇన్సులేటర్లు, తోలుగుడ్డలు, లినోలియం వగైరాలు.

మొదటి ప్రణాళికా కాలంలోనే ఉమ్మడిగా విదేశీ పెట్టుబడి దారులతో కలసి మూడు నూనె శుద్ధి కర్మాగారాలుకూడా నెలకొల్ప బడ్డాయి.

ఇదే కాలంలో పెట్టుబడుల సహాయి నిమిత్తం కొన్ని సంస్థలు యేర్ప రచ బడ్డాయి. (1) ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్. ఇది 1948లో ప్రభుత్వంచే నిర్మించబడింది. పరిశ్రమలకు అప్పులు యివ్వడం, అడ్వాన్సులివ్వడం, డిబెంచర్లు తీసుకోవడం, పరిశ్రమలు తీసుకున్న అప్పులకు గ్యారంటీ యివ్వడం దీనియొక్క విధులు. రాష్ట్రాలలో కూడా దీనియొక్క శాఖలు నిర్మించబడు తున్నాయి. (2) జాతీయ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్. 1954 అక్టోబర్లో ప్రయివేట్ లిమిటెడ్ కంపెనీగా యేర్పరచబడింది. పథకం ప్రకారం అభివృద్ధికి తోడ్పడే పరిశ్రమలకు, ప్రధానంగా యంత్రోత్పత్తి పరిశ్రమలకు సహాయం చేయడం, పారిశ్రామిక పథకాల పరిశీలనను దేశీయ, విదేశీయ నిపుణుల సహాయంతో చేయడం దీనియొక్క విధులు. పరిశ్రమ లను పునరుద్ధరించేందుకు, వాటి కప్పులిచ్చేందుకు నూతన యంత్రాలమర్చేం దుకు సహాయంచేసే ప్రభుత్వ యేజన్సీగా పనిచేస్తుంది. (3) పారిశ్రామిక పరపతి పెట్టుబడుల కార్పొరేషన్. 1955 జనవరిలో ప్రయివేట్ లిమి టెడ్ కంపెనీగా యేర్పరచబడింది. ప్రయివేట్ రంగంలోని పరిశ్రమలకు సహాయం చేస్తూంటుంది. (4) జాతీయ లఘు పరిశ్రమల కార్పొరేషన్. 1955 ఫిబ్రవరిలో ప్రయివేట్ లిమిటెడ్ కంపెనీగా యేర్పరచబడింది. చిన్న తరహా పరిశ్రమలకు సహాయం చేస్తూ ఉంటుంది.

ప్రభుత్వ అంచనాల ప్రకారం తొలిప్రణాళికా కాలంలో పారి శ్రామికోత్పత్తి మొత్తం 22% పెరిగింది. బట్టలు, నూనె, పంచదార, సిమెంటు, పేపరు, సోడా, సైకిళ్ళు, కుట్టుమిషన్లు, నూనెశుద్ధి కర్మాగారం

మొదలైనవాటిలో వేసుకున్న అంచనాలకు సమంగా గాని, అంతకుమించి గాని ఉత్పత్తి జరిగింది. ఇనుము, ఉక్కు, అల్యూమినియమ్, యంత్రపరికరాలు, ఎరువులు కూడా అనుకున్నమేరకు ఉత్పత్తిని అందుకున్నాయి. డీసెల్ ఇంజన్లు, పంపులు, కార్లు, రేడియోలు, బాటరీలు, ఎలక్ట్రిక్ పంకాలు, జనపనార సంచులు, గ్లాసువార్నిష్‌లు వగైరా అనుకున్నంత ఉత్పత్తి జరుగలేదు. కొన్ని రసాయనిక పదార్థాలు, పెన్సిలిన్, డి. డి. టి. మొట్ట మొదటుగా మనదేశంలో ఉత్పత్తి అవుతున్నాయి. సింద్రీ యెరువుల ఫ్యాక్టరీ, చిత్తరంజన్ రైలుయింజన్ల ఫ్యాక్టరీ, తాతా లోకోమోటివ్ ఇంజనీరింగ్ వర్క్సు, నూనెశుద్ధి కర్మాగారాలు మొదలైనవి తయారవడం వలన భారీపరిశ్రమల్లో సహితం కొద్దిగా అభివృద్ధి జరిగింది. ఈ ఉత్పత్తిఫలితంగా జాతీయాదాయం 9110 కోట్ల రూపాయలనుండి 10800 కోట్లవరకూ అంటే 18 శాతం ఎక్కువయింది. తల ఒక్కింటికి సగటు ఆదాయం 11 శాతం పెరిగింది.

కాని మొత్తంగా చూచినపుడు మొదటి ప్రణాళికలో ప్రభుత్వ రంగం చాలవరకు అశ్రద్ధ చేయబడింది. ఈ రంగంలో పారిశ్రామికాభివృద్ధికి కేటాయించబడిన రు. 101 కోట్లలోను 57 కోట్లు మాత్రమే ఖర్చు పెట్టబడినట్లు పైన చూచాము. ఈ రంగంలో నెలకొల్పబడిన 14 పరిశ్రమల లోను సగంమాత్రమే ఉత్పత్తిలక్ష్యాలను పూర్తిచేయగలిగాయి. ఉదా॥ ఇనుపకడ్డీల ఉత్పత్తి లక్ష్యం పూర్తిగా విఫలమయిందనే చెప్పాలి. అదే విధంగా సంవత్సరానికి 1600 లేత్ యంత్రాలు ఉత్పత్తి చేయాలనే లక్ష్యానికి, ఆచరణలో 77 మాత్రమే ఉత్పత్తి అయ్యాయి.

ప్రయివేట్ పరిశ్రమలలో కొన్నింటిలో అభివృద్ధి సాధించబడిన మాట వాస్తవమే. అయితే వీటిలో ఉత్పత్తి పెరుగుదల నూతన పరిశ్రమలను నెలకొల్పుటద్వారాకన్నా ప్రధానంగా పాత పరిశ్రమలను పూర్తిగా పనిచేయించడం, కార్మికుల శ్రమ తీవ్రతను పెంచడం, రేషనలైజేషన్ వగైరా పద్ధతుల ద్వారానే సాధించబడింది. ఈ అభివృద్ధికి ప్రేరేపకశక్తి ప్రణాళిక ఆశయాలుగాక పెట్టుబడిదారుల లాభాపేక్షయే. ప్రయివేట్ పెట్టుబడి ప్రభుత్వం నిర్దేశించిన పథకాలలోనికి గాక లాభాలుతెచ్చే పరిశ్రమలలోకే ప్రవహించింది.

# రెండవ పంచవర్ష ప్రణాళిక

రెండవ పంచవర్ష ప్రణాళికలో సోషలిస్టు సాంఘిక వ్యవస్థను రూపొందించడమే ప్రధానాశయంగా చెబుతూ యిలా వ్రాయబడింది. "మన ఆర్థిక వ్యవస్థ ప్రధానలక్ష్యం, ఇట్టి వ్యవస్థను (సోషలిస్టు సాంఘిక వ్యవస్థను) అవతరింపజేయడమే. ఈ వ్యవస్థలో అభివృద్ధి అనేది వ్యక్తిగత ప్రయోజనాలకోసం గాక, సమాజపు సమిష్టి శ్రేయస్సుకొరకే సాధించబడుతుంది. అభివృద్ధితీరు, సాంఘిక, ఆర్థిక సంబంధ బాంధవ్యములు చక్కగా సమన్వయం పొంది, జాతీయాదాయమును పెంపొందించి, ప్రజలకు చాలినన్ని ఉద్యోగావకాశములను కల్పించుటతోపాటు ఆర్థిక సమానత్వమును సాధించవలసియున్నది. సమాజమందలి సామాన్య పౌరులుకూడ పైకివచ్చే పరిస్థితులను కల్పించవలసియున్నది." (ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సంగ్రహ పాఠం. పుట 8).

ప్రభుత్వరంగం విస్తరించవలసిన అవసరాన్ని గురించి చెబుతూ, "ఇట్టి పరిస్థితులను కల్పించడానికి ప్రభుత్వం అనేక బాధ్యతలను స్వీకరించవలసియున్నది. ప్రభుత్వరంగం త్వరితగతిని విస్తరించాలి. దేశ ఆర్థికవ్యవస్థయందు పెట్టబడే పెట్టుబడులు (ప్రభుత్వ - ప్రైవేట్ పెట్టుబడులు) అన్నింటిలో, అది ప్రముఖపాత్రను వహించి ప్రయివేట్ రంగం స్వీకరించలేని అభివృద్ధి పనులను తానే ప్రారంభించవలసియున్నది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన అభివృద్ధి కార్యములు, భారీఉత్పత్తులు, సహజసంపదల కేటాయింపు మొదలగువాని బాధ్యతలను ప్రభుత్వమే స్వీకరించాలి"- అని రెండవ ప్రణాళిక చెబుతుంది. (పై పుస్తకం, పేజీ 8).

పై ఆశయాల సాధనకు రెండవ ప్రణాళిక యీ దిగువ లక్ష్యాలతో పనిచేయాలని చెప్పబడింది. (1) ప్రజల జీవన ప్రమాణములను పెంపొందింపజేయుటకు జాతీయాదాయమునందు తగినంత పెరుగుదలను సాధించుట. (2) ప్రాతిపదిక, భారీపరిశ్రమల స్థాపనకు ప్రత్యేక ప్రాధాన్యత నిస్తూ, సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించుట. (3) ఉద్యోగావకాశములను బహుళముగా కల్పించుట (దాదాపు 80 లక్షలమందికి). (4) ప్రజల ఆదాయము, సంపదలయందుగల వ్యత్యాసములను తగ్గించి, ఆర్థికశక్తిని సమానముగా పంచిపెట్టుట.

ఈ ప్రణాళికాకాలంలో ప్రభుత్వం పరిశ్రమలు, గనులు వీటి నిమిత్తం రు 890 కోట్లు ఖర్చుపెట్టాలని, ప్రయివేట్ పారిశ్రామికవేత్తలు యిదే పద్దుక్రింద రు 575 కోట్లు ఖర్చుపెట్టాలని నిర్ణయించబడింది. గత ప్రణాళికలో 8% మాత్రం ఈ రంగంలో ఖర్చుపెట్టిన ప్రభుత్వం మొత్తం ఖర్చులో యిప్పుడు 19% ఖర్చుపెట్ట దలచింది. ప్రభుత్వపరంగా ఖర్చుయ్యే రు 890 కోట్లలో చేతివృత్తులవారికి పనులు చూపించే దృష్టితోను, గ్రామీణ ప్రాంతాలలో యెక్కువమందికి అదనపుపని వసతి కల్పించే దృష్ట్యాను రు 200 కోట్లు చిన్నతరహా గ్రామీణ పరిశ్రమలకు ఖర్చు చేస్తారు. మిగతా రు 690 కోట్లలో యెక్కువభాగం ప్రాథమిక పరిశ్రమలైన యినుము, ఉక్కు, బొగ్గు పరిశ్రమలకు, భారీ యింజనీరింగు ఎలక్ట్రికల్ పరికరాలను తయారుచేసేందుకు వినియోగిస్తారు. ఈ దశలో, ఒక్కొక్కటి 10 లక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తి చేయగల రూర్కేలా భిలాయి, దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాలు యేర్పడతాయి. మైసూరు యినుము-ఉక్కు పరిశ్రమ యింకా అభివృద్ధి చేయబడుతుంది. ఫలితంగా ప్రభుత్వ రంగంలో 1960-61 నాటికి 20 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి జరుగుతుంది.

చిత్తరంజన్ లోకోమోటివ్ ఫ్యాక్టరీని అభివృద్ధి చేయడంవలన యిప్పుడది సాలీనా తయారుచేస్తున్న 125 యింజన్లకు బదులు 300 యింజన్లు తయారు చేస్తుంది. పెరంబూర్ కోచ్ ఫ్యాక్టరీ 350 రైలు పెట్టెలను తయారు చేస్తుంది. మీటర్ గేజ్ పెట్టెలకు మరొక ఫ్యాక్టరీనికూడ పెట్ట జూస్తున్నారు. ప్రయివేట్ రంగంలో తాతా ఉక్కు కర్మాగారం, యింజన్లు తయారుచేస్తున్న ఫ్యాక్టరీ మరింతగా అభివృద్ధి చెందుతాయి.

గనులకొరకు ప్రభుత్వ రంగంలో జరిగే ఖర్చు రు. 73 కోట్లూ ముఖ్యంగా బొగ్గు, నూనె గనులకొరకూ, భూగర్భ పరిశోధనకొరకూ ఖర్చు పెట్టబడుతుంది. ఇప్పు డుత్పత్తి అవుతున్న 3 కోట్ల 80 లక్షల టన్నుల బొగ్గులో 45 లక్షల టన్నులు మాత్రమే ప్రభుత్వరంగాన ఉన్నది. వచ్చే 5 ఏండ్లలో 2 కోట్ల 20 లక్షలు యెక్కువ ఉత్పత్తి జరగాలనీ, ఆ పెరుగుదలలో 120 లక్షల టన్నుల బొగ్గు ప్రభుత్వ రంగంయొక్క భాగంగా వుండాలనీ ఆలోచిస్తున్నారు. బొగ్గు అవసరాన్ని ప్రత్యేకంగా

దృష్టిలో పెట్టుకొని, బహుళ ప్రయోజనకారికాగల నైవేలీ లిగ్నైట్ ప్రాజెక్టును తమిళనాడులో నిర్మిస్తున్నారు.

ఇప్పుడు 43 లక్షల టన్నులుగానున్న సిమెంటు ఉత్పత్తి 130 లక్షల టన్నులవరకూ పెరగాలని ప్రణాళిక సూచిస్తూవుంది.

వాడకపు వస్తువుల ఉత్పత్తిని పెంచేవిషయంలో, బట్టల ఉత్పత్తిని 24% పెంచాలని ఆలోచన. అంటే 685 కోట్ల గజాల బట్ట యిప్పుడు యేటా ఉత్పత్తి అవుతూంటే, రెండవ ప్రణాళికాకాలంలో అది 850 కోట్ల వరకు పెరుగుతుంది. అదనంగా పెరిగే 170 కోట్ల గజాల బట్టకుగాను మిల్లులు యిప్పుడు ఉత్పత్తిచేసేదానికంటే 35 కోట్ల గజాలు యెక్కువ చేయవచ్చని ప్రభుత్వం సూచిస్తూంది. అందుకు అవసరమైన విధంగా యంత్రాలను అభివృద్ధిచేసుకోవడానికి, కొత్తవాటిని తెప్పించుకోడానికి ప్రయివేట్ పారిశ్రామికవేత్తలకు అవకాశం కల్పించింది. పోగా పవర్ మగ్గాలను కొత్తగా ప్రవేశపెట్టి వాటిద్వారా కొంత బట్ట నుత్పత్తిచేయాలనీ, మిగతాది చేనేతద్వారా ఉత్పత్తి జరగాలనీ ప్రభుత్వం ఆశిస్తూఉంది. నూలు ఉత్పత్తిని యెక్కువచేస్తూ యెక్కువమందికి పనికల్పించే దృష్టితో అంబర్ చర్కాలకు రు. 7 కోట్లు ఖర్చుపెట్టి ప్రభుత్వం ప్రవేశపెట్టవలచింది. ఈ ప్రయత్నాలవలన 100 కోట్ల గజాల బట్ట యెగుమతులకు పోగా దేశంలో సగటున మనిషి ఒక్కింటికి 18 గజాల చొప్పున బట్ట ఉత్పత్తి అవుతుంది.

పంచదార ఉత్పత్తి 35% పెరుగుతుంది. కాగితం రెట్టింపు ఉత్పత్తి అవుతుంది. 16 లక్షలనుండి, 21 లక్షల టన్నులవరకు వెజిటబుల్ ఆయిల్స (నూనె) ఉత్పత్తి పెరుగుతుంది.

రెండవ ప్రణాళిక ఫలితంగా పారిశ్రామిక రంగంలో ప్రయివేటున గాని, ప్రభుత్వపరంగాగాని ఫ్యాక్టరీ ఉత్పత్తి నూటికి 64 వంతులు ఎక్కువ అవుతుంది, ప్రభుత్వం తన దృష్టిని భారీ పరిశ్రమలపై కేంద్రీకరిస్తున్నందున ఆ ఉత్పత్తి నూటికి 150 పాళ్ళు ఎక్కువవుతుంది.

గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలకొరకు ఖర్చుబెట్టే రు. 200 కోట్లలో రు. 59½ కోట్లు చేనేతకు, రు. 55½ కోట్లు ఖద్దరకు, రు. 55 కోట్లు చిన్నతరహా పరిశ్రమలకూ, మిగిలినది మిగతా కుటీర పరిశ్రమలు మొదలైన వాటికీ ఖర్చుపెడతారు.

ఇవీ రెండవ ప్రణాళికాకాలంలో సాధించదలచుకున్న లక్ష్యాలు.

ప్రభుత్వ రంగాన్ని విస్తరింపజేయుట, కొన్ని కీలక భారీ పరిశ్రమలను ప్రభుత్వ రంగంలోనే నిర్మించ సంకల్పించుట హర్షించదగిన విషయాలు.

కాని ప్రభుత్వ రంగంలో పెట్టదలచుకున్న. 4800 కోట్ల ఖర్చులో పరిశ్రమల పద్దుక్రింద ఖర్చుపెట్టదలచుకున్న రు. 890 కోట్లు 18.5 శాతం మాత్రమే. సత్వర పారిశ్రామికాభివృద్ధి లక్ష్యాన్ని సాధించాలంటే యిది చాలా తక్కువ. వీనిలో పెద్ద, మధ్యరకపు పరిశ్రమలకు ఖర్చుపెట్టేవి రు. 690 కోట్లు మాత్రమే. ఇది మొత్తం ఖర్చులో 14.4 శాతం. రు. 690 కోట్లలోను మూడు ఉక్కు కర్మాగారాలక్రింద కేటాయించిన రు. 350 కోట్లుపోతే మిగిలేది రు. 340 కోట్లు మాత్రమే.

కీలకపరిశ్రమమైన యంత్ర నిర్మాణ పరిశ్రమకు మొదట కేటాయించిన రు. 150 కోట్లు చివరకు రు. 82 కోట్లకు తగ్గించబడింది. ఇది ఏమాత్రమూ చాలదు. ప్రస్తుతం మనం సంవత్సరానికి సగటున రు 100 కోట్ల విలువగల యంత్ర సామగ్రిని దిగుమతి చేసుకుంటున్నాము. రెండవ ప్రణాళిక ఆఖరుకుకూడా యింకా 20.25 కోట్ల రూపాయల విలువగల యంత్రాలను దిగుమతి చేసుకోవలసి వస్తుంది.

అలాగే నౌకా నిర్మాణానికి కేటాయించిందికూడా స్వల్పమే. 1950 నాటికి 20 లక్షల టన్నేజ్ గల ఓడలను నిర్మించదలిస్తే 10 లక్షల టన్నేజ్ గల ఓడలనే నిర్మించగలిగాము.

ఈ ప్రణాళికలో స్వతంత్ర రక్షణ పరిశ్రమ (Defence) విషయమే ఆలోచించలేదు. మనదేశ రక్షణ కవసరమైన సామగ్రిని దిగుమతి చేసుకునేందుకు కోట్లకొలదీ రూపాయలు ప్రతి సంవత్సరం ఖర్చుచేస్తూనే యున్నాము. ఒక్క 1953-54 లోనే 26 కోట్ల 25 లక్షల 10 వేల రూపాయల విలువగల రక్షణ సామగ్రిని దిగుమతి చేసుకున్నాము. ఈ విధంగా కొన్ని ముఖ్యమైన కీలక పరిశ్రమల నిర్మాణానికి రెండవ ప్రణాళికకూడా పూనుకోవడంలేదు.

## ప్రభుత్వ, ప్రయివేట్ రంగాలు - వాటి నిష్పత్తి

రెండవ ప్రణాళిక లక్ష్యాలను వివరిస్తూ ప్రభుత్వ రంగం విస్తరించవలసి యుంటుందని, దేశ ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వ పెట్టుబడులు (పబ్లిక్

రంగంలోని పెట్టుబడులు) ప్రముఖపాత్రను వహించవలసి యుంటుందని చెప్పబడింది. ఈ ఆశయాన్ని ప్రజాస్వామికవాదు లందరూ హర్షించారు. ఆచరణలో యీ ఆశయం యెంతవరకు నెరవేరుతుందో పరిశీలించవలసి యున్నది.

మొదటి, రెండవ ప్రణాళికా కాలాలలో ప్రభుత్వ, ప్రయివేట్ రంగాలలో వివిధ పద్దులక్రింద ఖర్చుపెట్టిన లేక పెట్టబోతున్న పెట్టుబడులను లెక్కగట్టి ప్రభుత్వరంగం ప్రయివేట్ రంగాన్ని అధిగమించగలదని చెప్పుకోవడం జరుగుతూంది. ఉదాహరణకు కేంద్ర ప్రభుత్వం ప్రచురించిన ద్వితీయ ప్రణాళిక సంగ్రహపాఠం (తెలుగు) లో 22 వ పేజీలో మొదటి ప్రణాళిక ఆఖరుకు ప్రభుత్వ - ప్రయివేట్ పెట్టుబడులు 50 : 50 నిష్పత్తిలో ఉన్నాయని, ద్వితీయ ప్రణాళిక ఆఖరుకు అవి 61 : 39 నిష్పత్తిలో ఉండగలవని చెప్పబడింది. కేవలం పెట్టుబడుల అంకెలను చూస్తే ఇది సరియైనదే.

కాని నిజానికి ఒకరంగంయొక్క ఆధిక్యతను నిర్ణయించేది ఆ రంగంలో పెట్టిన ఖర్చులుకావు. ఆ యా రంగాలలోని లాభదాయక పెట్టుబడులే (Productive investments) ఆ యా రంగాల ఆధిక్యతను నిర్ణయిస్తాయి. ఆదృష్టితో పరిశీలించినపుడు ప్రభుత్వ రంగంకన్న ప్రయివేట్ రంగం ఆధిక్యతను కలిగియున్నదని స్పష్టమవుతుంది.

## ప్రభుత్వరంగంలో లాభదాయక పెట్టుబడి :

1950-'51 నాటికి ప్రభుత్వరంగంలోని పెట్టుబడి మొత్తం రు. 1236 కోట్లు (బుక్ వాల్యూ) ఉన్నవి. ప్రభుత్వ, ప్రయివేట్ రంగాలు రెండింటికీ సేవచేసే రైల్వేరవాణా ఒకప్రత్యేక పరిశ్రమగా పరిగణించినటయితే దానిక్రింద పెట్టబడిన పెట్టుబడి (చిత్తరంజన్‌తో కలిసి) రు. 837 కోట్లు తీసివేయగా మిగిలిన పెట్టుబడి రు. 399 కోట్లు మాత్రమే. ఈ రు. 399 కోట్లలోను కేవలం పరిశ్రమలకు వెచ్చించిన మొత్తం రు. 44 కోట్లు మాత్రమే. మొదటి ప్రణాళికా కాలంలో పరిశ్రమలకు ప్రభుత్వరంగంలో ఖర్చుపెట్టినది రు. 60 కోట్లు. ఇవి రెండూ కలిపితే మొదటిప్రణాళిక ఆఖరుకు ప్రభుత్వరంగంలోని లాభదాయక పెట్టుబడి రు. 104 కోట్లు (44+60) మాత్రమే. రెండవ ప్రణాళికలో ప్రభుత్వరంగంలో పరిశ్రమలకు, ఖనిజాలకు ఖర్చు చేయదలచిన రు. 710 కోట్లు దీనికి చేరిస్తే రెండవ ప్రణా

ళిక ఆఖరుకు ప్రభుత్వరంగంలోని లాభదాయక పెట్టుబడి మొత్తం రు. 814 కోట్లు మాత్రమే ఉంటుంది.

ప్రయివేట్ రంగంలో లాభదాయక పెట్టుబడి :

పై వలెనే రవాణా పెట్టుబడులు తీసివేస్తే 1950-'51 నాటి ప్రయివేట్ రంగంలోని లాభదాయక పెట్టుబడుల మొత్తం రు. 750 కోట్లు. మొదటి ప్రణాళికాకాలంలో ప్రయివేట్ రంగంలో పెట్టబడిన లాభదాయక పెట్టుబడి మొత్తం రు. 340 కోట్లు దీనికి కలిపితే మొదటి ప్రణాళిక ఆఖరుకు యీ మొత్తం పెట్టుబడి రు. 1,090 కోట్లు అయింది. రెండవ ప్రణాళికా కాలంలో యీ రంగంలో మరొక రు. 620 కోట్లు పెట్టాలని నిశ్చయించబడింది. కాబట్టి రెండవ ప్రణాళిక ఆఖరుకు ప్రయివేట్ రంగంలోని లాభదాయక పెట్టుబడులు మొత్తం రు. 1,710 కోట్లు (బుక్ వాల్యూనుబట్టి) ఉంటుంది.

కావున యథార్థానికి రెండవ ప్రణాళిక ముగిసే నాటికికూడా ప్రయివేట్ రంగంలోని లాభదాయక పెట్టుబడులు ప్రభుత్వరంగంలోని లాభదాయక పెట్టుబడులకన్నా రెట్టింపు ఉంటాయనేది స్పష్టమవుతుంది. బుక్ వాల్యూ ప్రకారమైతేనే రెట్టింపు. కాని అసలు విలువ తీసుకుంటె 1950 కి పూర్వమున్న పెట్టుబడుల విలువలు చాలా ఎక్కువే ఉంటాయి.

పైన వివరించినదానినిబట్టి ప్రభుత్వ రంగం త్వరితగతిని ప్రయివేట్ రంగాన్ని అధిగమిస్తూందనీ, మరి ఒకటి రెండు ప్రణాళికల కాలంలో ప్రయివేట్ రంగం పబ్లిక్ రంగంతో పోల్చినపుడు అప్రాముఖ్యమైపోతుందని చెప్పే వాదనలు అతిశయోక్తులనీ, అయథార్థాలనీ తేలుతుంది.

## ప్రయివేట్ పెట్టుబడులు - ప్రభుత్వ వైఖరి

జాతీయాభివృద్ధికి, జాతీయావసరాలకు, ప్రజల మేలుకు అనుగుణ్యంగా వ్యవహరించకపోయినా, ప్రయివేట్ పెట్టుబడిని ప్రోత్సహించాలనే పేరుతో ప్రభుత్వం వారికి చాలా సౌకర్యాలు కలుగచేస్తూ ఉంది. 1948 లో పెట్టుబడి లాభాల పన్నును రద్దుచేయడంద్వారాను, 1950 లో వ్యాపార లాభాల పన్నును రద్దుచేయడంద్వారాను, ఆదాయపు పన్నురేటును తగ్గించుటద్వారాను మొత్తం ప్రయివేట్ పెట్టుబడిదారుల

పైన బడుతున్న పన్నులో 23 కోట్ల 62 లక్షల రూపాయల పన్నును తగ్గించింది. అయితే 1948-57 ల మధ్యకాలంలో వీరిపైన అదనంగా వేసిన యితర పన్నులు 36 కోట్ల 85 లక్షల రూపాయలు మాత్రమే. అంటే అదనంగా వీరిపైనబడిన పన్నులభారం 13 కోట్ల 23 లక్షలు మాత్రమే. ఇతర సాధారణ ప్రజలపైన వేసిన పన్నులతో పోల్చిచూస్తే యిది చాలా తక్కువే

1948-'56 సంవత్సరముల మధ్యకాలంలో కొత్తగాపెట్టిన పరిశ్రమలకు, మూడుషిఫ్టులు పనిచేసే పరిశ్రమలకు, అరుగుదల ఖర్చుక్రింద మామూలు కన్న హెచ్చింపు మినహాయించు కునేందుకు అంగీకరించబడింది. 1954 మార్చి 31 వ తేదీ తర్వాత నెలకొల్పబడిన పరిశ్రమలకు మామూలుగా యంత్రం అరుగుదల ఖర్చులక్రింద ప్రారంభంలో తీసివేసే 20% స్థానే 25%, అభివృద్ధి రిబేట్ పేరుతో, తగ్గించుకుకు అంగీకరించబడింది. 1948 నుండి 1961 వరకు నూతనంగా స్థాపించబడే పరిశ్రమలలో కొన్నింటికి, అవి ప్రారంభించిన 5 సంవత్సరముల వరకు, పెట్టుబడిలో 60% మేరకు లాభాల పైన ఆదాయపుపన్ను మినహాయించబడింది. ఈ సౌకర్యాలను గురించి ప్రొఫెసర్ కాల్డార్ "చాలా కేసులలో యీవిధంగా యిచ్చిన సౌకర్యాల విలువ మొత్తం ఖర్చును మించిపోతుంద"ని అన్నారు.

పైనచెప్పిన సౌకర్యాల ననుభవించడమేగాక ప్రతీసంవత్సరం పెద్ద పెద్ద పెట్టుబడిదారులు ఎగవేసే పన్ను రు. 200 - 300 కోట్లవరకు ఉంటుందని కాల్డార్‌గారి అంచనా. ప్రయివేట్ పెట్టుబడిదారులకు కొందరికి ప్రభుత్వం వడ్డీలుతేకుండా అప్పులు యివ్వడం కూడా జరుగుతూంది. ఉదా॥ టాటా ఉక్కుకంపెనీకి రు. 10 కోట్లు, ఇండియన్ ఉక్కు, యినుము కంపెనీకి రు. 10 కోట్లు వడ్డీ లేకుండానే అప్పు యివ్వబడింది.

## పెట్టుబడులు - అవి చేస్తున్న దోపిడీ

భారతదేశం వలసదేశంగా ఉన్నంతకాలమూ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన జాతీయ పరిశ్రమలను అభివృద్ధికాకుండా ఆటంకపరచడమే గాక మన దేశసంపదలను కొల్లగొట్టుకపోవడం ఫలితంగానే మన దేశం యొక్క ఆర్థికాభివృద్ధి కుంటుపడిందనీ, మన ప్రజల జీవనస్థాయి అతి

తక్కువగా ఉన్నదనీ, కావున బ్రిటిష్ ప్రభుత్వం మన దేశంనుండి వైదొలగాలనే లక్ష్యంతో మన జాతీయోద్యమం నడిచింది. ఎట్టకేలకు స్వాతంత్ర్యం సిద్ధించింది. కాని స్వాతంత్ర్యం వచ్చి 11 సంవత్సరాలు అయినా యింత వరకు విదేశీ పెట్టుబడుల గోడిచ్చేడ మనకు వదలసే లేదు. పైగా స్వాతంత్ర్యానంతరం విదేశీ పెట్టుబడుల మొత్తం పెరిగింది.

1950 లో రిజర్వు బ్యాంకు ప్రకటించిన అంచనాల ప్రకారం 1948 జూన్ 30 వ తేదీనాటికి మన దేశంలోని విదేశీ పెట్టుబడులు (బుక్ వాల్యూ ప్రకారం) రు. 287.57 కోట్లు. దీనిలో బ్రిటిష్ పెట్టుబడులు రు. 230 కోట్లు (70 శాతం). అమెరికన్ పెట్టుబడులు రు. 18 కోట్లు (6.26 శాతం). మరల 1953 డిసెంబరులో రిజర్వు బ్యాంకు ప్రకటించిన అంచనాల ప్రకారం మొత్తం విదేశీ పెట్టుబడి రు. 419 కోట్లకు పెరిగింది. దీనిలో బ్రిటిష్ పెట్టుబడులు రు. 350 కోట్లు (80 శాతం), అమెరికన్ పెట్టుబడులు రు. 31 కోట్లు (7.4 శాతం) ఉన్నాయి.

1958 జూన్ నాటికి రిజర్వుబాంకు పరిశీలన ప్రకారమే (స్టేట్స్మన్ పత్రికలో ప్రకటించబడింది). విదేశపెట్టుబడుల మొత్తం రు. 650 కోట్లకు పెరిగినట్లు తెలుస్తోంది. దీనినిబట్టి క్రమంగా విదేశీ పెట్టుబడుల మొత్తమూ, అవి ప్రవేశిస్తున్న వేగముకూడ పెరుగుతున్నట్లు స్పష్టమవుతుంది. అమెరికాలో మొరార్జీ దేశాయిగారి మంతనాల పిమ్మట బ్రిటన్, కెనడా, అమెరికా, పశ్చిమ జర్మనీ, జపాన్ మొదలైన పెట్టుబడిదారీ దేశాలనుండి మరింతజోరుగా విదేశీ పెట్టుబడి మన దేశంలో జొరబడేటట్లున్నది. (వివరాలు మరొకచోట చూడగలరు).

విదేశీ పెట్టుబడులు అనేకరూపాలలో మనదేశంలోనికి వస్తున్నాయి. ఇదివరకే నెలకొల్పిన తమ పరిశ్రమలను విస్తృతం చేయుటద్వారానూ, కొద్దిపాటి భారతీయ షేర్లతో విదేశస్తులు ప్రారంభించే నూతన పరిశ్రమల ద్వారానూ, భారత ప్రభుత్వమూ లేక భారత పెట్టుబడిదారులు తెచ్చే అప్పులద్వారానూ, భారతీయ పెట్టుబడిదారులు, విదేశీ పెట్టుబడిదారులు కలిసి జాయింటుగా పెట్టే పరిశ్రమలద్వారానూ (ఉదా: బిర్లా-నఫీల్డ్ కంబైన్, తాతా-యింపీరియల్ కెమికల్ యిండస్ట్రీస్, సేన్-రాలే వగైరాలు), భారత ప్రభుత్వమూ, విదేశీ ప్రభుత్వాలు లేక పెట్టుబడిదారులు కలిసి నెలకొల్పే పరిశ్రమలద్వారానూ (ఉదా: మైసూరు యంత్ర పరి

కరాల ఫ్యాక్టరీ, ఉక్కు కర్మాగారాలు, నూనెశుద్ధి కర్మాగారాలు), ప్రపంచ బ్యాంకు, ఎగుమతి-దిగుమతి బ్యాంకు వగైరాలు యిచ్చే అప్పులు ద్వారానూ, అమెరికాయొక్క పాయింటు 4 కార్యక్రమం, కొలంబో పథకం మొ॥ వాని క్రింద యిచ్చే సాంకేతిక సహాయ కార్యక్రమాలద్వారా విదేశీ పెట్టుబడులు మనదేశంలో ప్రవేశిస్తున్నాయి.

మనదేశంలోనున్న విదేశీ పెట్టుబడుల స్వభావాన్ని పరిశీలించినట్లయితే వాటికి మన ఆర్థిక వ్యవస్థలోగల పాత్ర స్పష్టమవుతుంది. ఈ పెట్టుబడులు ప్రధానంగా టీ, కాఫీ తోటలలోనూ, ఓడలు, గనులు, తోళ్ళు, జనపనార, ఉన్నిబట్టలు, సబ్బులు, రబ్బరు, అగ్గిపెట్టెలు మొదలగువాడకపు సరుకులకు సంబంధించిన తేలిక పరిశ్రమలలోను, తేలిక యింజనీరింగ్ పరిశ్రమలలోను పెట్టబడ్డాయి. ఇవన్నీ త్వరగానూ, హెచ్చుగానూ లాభాలు తెచ్చిపెట్టే పరిశ్రమలే.

స్వాతంత్ర్యానంతరం పెట్టబడిన విదేశీ పెట్టుబడులుకూడా 85 శాతం వరకు అదివరకే నెలకొల్పబడిన తమ పరిశ్రమలను అభివృద్ధి చేసేందుకే వినియోగించబడింది.

| | |
|---|---|
| నూతన యంత్రా లమర్చేందుకు | రు. 63 కోట్ల 97 లక్షలు |
| వ్యాపారంలో | 3 ,, 43 ,, |
| వాడకపు సరుకుల పరిశ్రమలలో | 18 ,, 69 ,, |
| కాఫీ, టీ తోటలలో | 19 ,, 91 ,, |

యంత్రాల క్రింద ఖర్చుబెట్టిన రు. 63 కోట్ల 97 లక్షలలోను పొగాకు, సిగరెట్ పరిశ్రమలలో 19 కోట్ల 48 లక్షలు ఖర్చుచేయబడ్డాయి. దీనినిబట్టి విదేశీ పెట్టుబడి మన పారిశ్రామికాభివృద్ధికి ఎట్టి విధంగానూ తోడ్పడడంలేదని చెప్పాలి.

అయినప్పటికీ ప్రభుత్వం విదేశీ పెట్టుబడులను ప్రోత్సహించుతూనే ఉన్నది. వారికి అనేక హామీలను యిస్తూవస్తూంది. 1949 వ సం॥లో ప్రజాపరిషత్ సభలో మన ప్రధాన మంత్రి విదేశీపెట్టుబడులకు యీ క్రింది హామీనిచ్చారు. విదేశీ పెట్టుబడులకు, జాతీయ పెట్టుబడులకు మధ్య విచక్షణ చూపించబడదు. దేశంయొక్క విదేశీమారకపు పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని విదేశస్థులు లాభాలను తరలించుకుపోయేందుకు, పెట్టుబడులను

ఎత్తుకుపోయేందుకు న్యాయమైన అవకాశాలు యివ్వబడతాయి. ప్రస్తుతానికి విదేశీ పెట్టుబడులను జాతీయం చేసే ఆలోచన లేదు. ఒకవేళ జాతీయం చేయవలసివస్తే సరసమైన, సమానమైన విలువగల నష్టపరిహారం యివ్వబడుతుంది. ఈనాటివరకు యిదే విధానం కొనసాగించబడుతూంది. అప్పులకు బయలుదేరినప్పట్లా కొత్త సౌకర్యాలు కోరబడుతున్నాయి. ఈనాడు పాశ్చాత్య పెట్టుబడిదారి దేశాలు కోరుతున్న గొంతెమ్మ షరతుల కన్నింటికి ప్రభుత్వం అంగీకరించబోతున్నట్లు తెలుస్తూంది. (వివరాలు రాబోయే పుటలలో చూడగలరు.)

ఇక స్వతంత్ర భారతదేశంలో యీ విదేశీ పెట్టుబడుల దోపిడీ ఎలా సాగుతుందో చూద్దాం. ప్రతి సంవత్సరము విదేశస్తులు తమ పెట్టుబడులపైన యీ క్రింది విధంగా లాభాలు పట్టుకుపోతున్నట్లు అంచనాలు వేయబడ్డాయి.

| | |
|---|---|
| పరిశ్రమలు, ఓడకేవులు, వ్యాపారంద్వారా | రు. 125 కోట్లు |
| డివిడెండ్లు, వడ్డీ వగైరాలక్రింద ప్రభుత్వం వీరికి చెల్లిస్తున్నది. | రు. 30 ,, |
| మొత్తం | రు. 155 ,, |

రెండవ ప్రణాళిక ఆఖరుకు మరొక రు. 250-300 కోట్ల మధ్య విదేశీ పెట్టుబడులు రాగలవని అంచనా వేయబడింది. వాటిపైన లాభం దాదాపు 50-60 కోట్ల రూపాయలవరకు ఉండవచ్చు. అంటే 1961 నాటికి విదేశీ దోపిడీ సంవత్సరానికి 205-215 కోట్ల రూపాయలవరకు ఉంటుంది. స్వాతంత్ర్యానికి పూర్వం బ్రిటిష్ దోపిడీ సగటున సంవత్సరానికి 15 కోట్ల పౌనులు (దాదాపు 220 కోట్ల రూపాయలు) అనేది యీ సందర్భంలో గుర్తుకు తెచ్చుకోవడ మవసరము.

ఈ విదేశీ పెట్టుబడుల మూలంగా మనదేశం అనేకవిధాల నష్టపోతున్నది. ఇవి మన పారిశ్రామికాభివృద్ధికి, ముఖ్యంగా కీలక పరిశ్రమల అభివృద్ధికి ఎట్టి విధంగానూ తోడ్పడకపోగా సంవత్సరానికి దాదాపు రు.155 కోట్ల రూపాయలవరకు మన జాతీయాదాయాన్ని కొల్లగొట్టుకుపోతున్నాయి. విదేశస్తుల పెత్తనం మూలంగా మన విదేశీ వ్యాపారంలో సంవత్సరానికి రు. 150 కోట్లవరకు నష్టం వస్తూంది. పైగా యీ పెట్టుబడులు

మన ఆర్థిక వ్యవస్థలో కొన్ని కీలక స్థానాలలో ఉండి, జాతీయ గుత్త పెట్టుబడిదారులతో కలిసి, మన జాతీయ ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా తయారయ్యాయి.

అందువలన మన ఆర్థికవ్యవస్థలో యీ విదేశీ పెట్టుబడిదారుల పెత్తనం పోవాలి. ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడుల చేతులలోనున్న జనప నార, తేయాకు పరిశ్రమ, బ్యాంకులు, గనులు మొదలగువాటిని జాతీయం చేయవలసియుంటుంది. వీటిని స్వాధీనం చేసుకుంటే చాలా నష్టపరిహారం యివ్వాలనే వాదన ఉన్నది. ఇవ్వవలసివస్తే వాయిదాలమీద వీటినుండి వచ్చే లాభాలలోనుండే చెల్లించవచ్చును.

## భారతదేశంలో గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థాభివృద్ధి

భారతదేశంయొక్క 39 వ ఆర్టికల్‌లో మన ఆర్థిక వ్యవస్థను యీ క్రింది విధంగా రూపొందించుకోవాలని నిర్దేశింపబడింది.

"సర్వజనులకు సౌఖ్యంకలిగే విధంగా దేశంలోనున్న భౌతిక సంపదలపై హక్కునూ, పెత్తనాన్నీ, అందరి చేతులలో ఉంచాలి...... సంపదలూ, ఉత్పత్తి సాధనాలూ కొందరి చేతులలో కేంద్రీకృతం కావడమూ, ప్రజలకు నష్టంగలగడమూ జరగని పద్ధతిలో మన ఆర్థికవ్యవస్థ నిర్వహించబడాలి."

మన పార్లమెంటు ఆమోదించిన రెండవ పంచవర్ష ప్రణాళికలో కూడా యిదే ఆశయం ప్రకటించబడింది.

"ఆదాయాలలోను, సంపదలలోను ఉన్న హెచ్చుతగ్గులను తొలగించి ఆర్థికస్తోమతను యిప్పటికన్న చాలావరకు సమంగా వుండేటట్లు పంచడం" ఒక్క ముఖ్య కర్తవ్యంగా పేర్కొనబడింది. అలాగే రెండవ ప్రణాళిక రిపోర్టులో, "ఆర్థికాభివృద్ధి వలన కలిగే లాభాలు సమాజంలో సౌకర్యాలేమీ లేని ప్రజానీకానికి అధికాధికంగా లభించేలా చూడాలి. ఆదాయాలు, సంపద, ఆర్థిక స్తోమత వీటి కేంద్రీకరణను క్రమక్రమంగా తగ్గించాలి" (రెండవ పంచవర్ష ప్రణాళిక - పుట 22).

బడుగుదేశాల ఆర్థిక సమస్యను చర్చిస్తూ ప్రణాళిక యిలా చెబుతూంది, "ఒకమూల అభివృద్ధి కొనసాగుతూ, రెండోమూల ఆర్థిక,

సాంఘిక అసమానతలు తన్నేవిధంగా ఉత్పాదక వనరుల్ని, వర్గసంబంధాలనూ సమన్వయ పరచుకోవాలి. ఇంత ఆలస్యంగా అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టిన బడుగుదేశాలను ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య యిదే... ఇప్పుడు ఆదాయాలలో, సంపదలలో అసమానత లున్నాయి. వాటిని సరిచేయాలి. అభివృద్ధితోపాటు యీ అసమానత లింకా పెరగకుండా తగు జాగ్రత్తలు తీసుకోవాలి. (రెండవ ప్రణాళిక - పుట 33).

చక్కని ఆశయాలు! కాని ఆచరణలో?

ఈ ఆశయాలు ఎలా అమలు జరుగుతున్నాయో యిప్పటివరకు చూచాము. మరికొంత లోతుకువెళ్ళి మనదేశంలో గుత్త సంస్థలు బలపడుతున్నాయో లేక నాటి కేంద్రీకరణ, శక్తి క్రమక్రమంగా తగ్గుతున్నాయో పరిశీలించుదాం.

మనదేశం పారిశ్రామికాభివృద్ధిలో వెనుకబడియున్నది గాన పెట్టుబడిదారీ విధానం యింకా శైశవదశలోనే యున్నదనీ, గుత్తయాజమాన్యం లేదనీ అర్థశాస్త్రజ్ఞులతోసహా చాలామంది భావిస్తుంటారు. కాని గత 30 సం॥లో మన ఆర్థికవ్యవస్థలోని పరిణామాలను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే మన వినియయసరుకుల ఉత్పత్తి తగినంతగా అభివృద్ధి చెందిందని, గుత్త యాజమాన్యం ప్రబలంగానే ఉన్నదని స్పష్టమవుతుంది. మన దేశంలో పరిశ్రమల పైనా, ఉత్పత్తి పైనా యాజమాన్యాన్ని, పెత్తనాన్ని గలిగి, ఆర్థిక, రాజకీయ జీవితంపైన అధికారాన్ని చలాయిస్తున్న గుత్త వ్యవస్థ, బాగా అభివృద్ధిచెందిన పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాల కేమీ తీసిపోనివిధంగా పెంపొందింది. "స్వేచ్ఛాయుత పోటీ" (Free enterprise) అనే ముసుగుక్రింద మనగుత్తవ్యవస్థలు తమ కబంధ హస్తాలను దాచివేయ జూస్తున్నాయి.

భారతదేశంలో గుత్తయాజమాన్యం రెండురూపాలలో ఉన్నది. (1) మేనేజింగ్ ఏజన్సీ విధానం లేక పెనవేసుకున్న డైరక్టరేట్ల ద్వారా పెత్తనాన్ని కేంద్రీకరించే పద్ధతి (2) మార్కెటింగు దశలో (సరుకులను అమ్మేదశలో) పెద్దమనుషుల ఒడంబడికల ద్వారా (Gentlemen's agreements) లేక అసోసియేషన్ల ద్వారా పోటీని నివారించే పద్ధతి. రెండవపద్ధతిని మొదటిదానిలోని గుత్తసంస్థలే నెలకొల్పుతున్నాయి.

ఆవిధంగా యిటు ఉత్పత్తిదశలోను, అటు మార్కెటింగ్ దశలోనూ కూడా పెత్తనం సాధించబడుతూంది.

1. మేనేజింగ్ ఏజెన్సీ పద్ధతి :

ఈ పద్ధతి మనదేశ పరిశ్రమలపైన బ్రిటిష్ పెట్టుబడిదారులు తమ పెత్తనాన్ని నిలుపుకునేందుకు ఒక ప్రధాన ఆయుధంగా ఉంటోంది. ఈపద్ధతివలన కొద్ది మేనేజింగ్ ఏజెన్సీ సంస్థలు వివిధపరిశ్రమల కంపెనీలను తమ అదుపుఆజ్ఞలలో ఉంచుకుంటాయి. వాటికి చాలావరకు పెట్టుబడి పెట్టేవీ, వాటి కార్యకలాపాలను నడిపేవీ, ఉత్పత్తిని కంట్రోల్ చేసేవీ, మార్కెట్లను వెదికిపెట్టేవీ యీ మేనేజింగ్ ఏజన్సీలే. ఆయా కంపెనీల డైరెక్టర్లుగా వీరే పనిచేస్తూ వుంటారు. వాటి లాభాలలో ప్రధానభాగం వాటాదారులకు గాక మేనేజింగ్ ఏజెన్సీలకు వెళుతుంది. ఇట్టి మేనేజింగ్ ఏజెన్సీలు బ్రిటిషువారివీ, భారతీయులవీ కూడా వున్నాయి.

ఎ. బ్రిమ్మర్ అనే ఆయన అంచనా ప్రకారం 1951-'52 లో పెట్టుబడిదారుల ఎన్‌సైక్లోపీడియాలో ప్రచురించబడిన మొత్తం పరిశ్రమలలో 100 కి 85 వంతులు మేనేజింగ్ ఏజెంట్ల పెత్తనంలో వున్నాయి. బొగ్గు; నారవాణా, సిమెంటు పరిశ్రమలు 100 కి 100 పాళ్ళు; జనపనార, జౌళి పరిశ్రమలు, తేయాకు తోటలలో 100 కి 90 వంతులు, ఇంజనీరింగు, విద్యుచ్ఛక్తి, దుంపనూనె, తోటలు వగైరాలలో 100 కి 80 వంతులు మేనేజింగ్ ఏజెన్సీల పెత్తనం క్రింద నిర్వహింపబడుతున్నాయి.

మేనేజింగ్ ఏజెన్సీలలో కూడా తిరిగి కేంద్రీకరణ జరిగింది. శ్రీ అశోకమెహతాగారి సర్వే ప్రకారం 200 మంది డైరెక్టర్లు 500 ప్రముఖ పారిశ్రామిక సంస్థలపైన పెత్తనం వహిస్తున్నారు. శ్రీ నవ గోపాల్‌దాస్ (ఐ.సి.యస్) రచించిన Industrial Enterprise in India అనే గ్రంథంలోను, డాక్టర్ ఎం. ఎం. మెహతా రచించిన "Structure of Indian Industries" అనే గ్రంథంలోను యిదే విధంగా చెప్పబడింది. మనదేశంలో 1939 లో రు. 23 కోట్ల పెట్టుబడి కలిగిన 100 జూట్ మిల్లులలోనూ రు. 8 కోట్ల పెట్టుబడిగల 53 జూట్ మిల్లులపైన 17 మేనేజింగ్ ఏజెన్సీలు పెత్తనం చేస్తున్నాయి. వీరిలో 4 గురు 30 మిల్లులపై పెత్తనం కలిగియున్నారు. రు. 6¼ కోట్ల పెట్టుబడిగల 60 బొగ్గు గనుల

పైన 18 ఫరంలు పెత్తనం చెలాయిస్తున్నాయి. వీటిలో 4 ఫరంల చేతులలో 31 గనులున్నాయి. తేయాకు పరిశ్రమకు చెందిన 117 కంపెనీలను 17 మేనేజింగ్ ఏజెన్సీలు నిర్వహిస్తున్నాయి. వీటిలో 74 కంపెనీలు 5 ఏజెన్సీల చేతులలో ఉన్నాయి.

కొన్ని పెద్దపెద్ద గుత్త సంస్థలు ఏకమై మరింత పెద్ద గుత్తసంస్థలుగా రూపొందడంకూడా చూస్తాము. ఉదాహరణకు ఎఫ్. ఇ. దిన్‌షాప్ లిమిటెడ్; తాతా సన్స్ లిమిటెడ్; కిల్లిక్ నిక్సన్ అండ్ కో; మాక్డొనాల్డ్ అండ్ కో మొదలైన 11 సంస్థలు కలిసిపోయి అసోసియేటెడ్ సిమెంటు కంపెనీని ఏర్పరచారు. ఈ కంపెనీ మనదేశంలో ఉత్పత్తయ్యే మొత్తం సిమెంటులో 61% సిమెంటుపైన పెత్తనం కలిగియుంది. అలాగే రెండు ఉన్నిమిల్లులు, ఒక బట్టలమిల్లు, దేశంలోకల్లా పెద్దదైన చెప్పుల పరిశ్రమ కలిసిపోయి బ్రిటిష్ ఇండియా కార్పొరేషన్‌గా రూపొందింది.

1939 నాటికి తాతా కుటుంబానికి 30 కోట్ల రూపాయల పెట్టుబడి కలిగిన 22 పారిశ్రామిక సంస్థలుండేవి. వీటిలో 4 బట్టలమిల్లులు, 4 విద్యుత్ సరఫరా కంపెనీలు, 1 నూనె కంపెనీ, యివిగాక రసాయనిక పరిశ్రమలు, హోటళ్ళు, ఇన్సూరెన్సు కంపెనీలు, ఒక యినుము, ఉక్కు ఫ్యాక్టరీ వగైరాలున్నాయి. వీటన్నిటియొక్క మొత్తం నిధులు 100 కోట్ల రూపాయలు. అలాగే 34 బ్రిటిష్ ట్రస్టుల చేతులలో 75.5 కోట్ల రూపాయల పెట్టుబడి కలిగిన 400 పారిశ్రామిక సంస్థలుండేవి. 1940-'46 ల మధ్య శ్రీ కందూభాయి దేశాయిగారి పరిశీలన ప్రకారం 150 మంది బట్టలమిల్లుల యజమానులు రు. 50 కోట్ల పెట్టుబడిగల బట్టల పరిశ్రమనంతటినీ కంట్రోల్ చేస్తున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యీ కేంద్రీకరణ మరింత పెరిగింది. ఈనాడు తాతా అండ్ సన్స్ 32 కంపెనీలపైన, బిర్లాలు 124 కంపెనీలపైన, జె. కె. గ్రూపు వారు 50 కంపెనీలపైన, దాల్మియా గ్రూపు 40 కంపెనీలపైన పెత్తనం వహిస్తున్నాయి.

ఇక కంపెనీ డైరెక్టర్ల నియామకాన్ని పరిశీలిస్తే యీ కేంద్రీకరణ మరింత కళ్ళకుకట్టినట్లు కనబడుతుంది. బొగ్గు పరిశ్రమలో 28 మంది వ్యక్తులు 247 డైరెక్టర్ పదవులను నిర్వహిస్తున్నారు. వీరిలో 7 గురు 64 పదవులలో ఉన్నారు. జనపనార పరిశ్రమలో 130 మంది వ్యక్తులు 267 డైరెక్టర్ పదవులను ఆక్రమించారు. అందులో 4 గురు 82 డైరెక్టర్ పదవు

లను నిర్వహిస్తున్నారు. శ్రీ అశోక మెహతాగారి పరిశీలననుబట్టి 1108 మంది వ్యక్తులు 3128 డైరెక్టర్ పదవులునిర్వహిస్తూంటే, వారిలో 61 మంది 1038 పదవులను, తిరిగి వీరిలో 20 మంది 805 పదవులను (ఒక్కొక్కరు సగటున 40) నిర్వహిస్తున్నారు. ఈవిధంగా మేనేజింగ్ ఏజన్సీ విధానం వలన కొద్ది సంస్థల చేతులలో అనేక కంపెనీలు కేంద్రీకరింపబడుటేగాక, కొద్దిమంది వ్యక్తుల చేతులలో అవి కేంద్రీకరింపబడ్డాయి. ఈ కొద్దిమంది వ్యక్తులు పారిశ్రామికాధిపతుల దగ్గరచుట్టాలే.

ఈ మేనేజింగ్ ఏజెన్సీ విధానాన్ని గూర్చి జాతీయప్రణాళికా సంఘం యొక్క సబ్‌కమిటీ తయారుచేసిన తాత్కాలిక రిపోర్టులో శ్రీ కె.టి.షా వ్రాస్తూ "ఈవిధానం మొదలంటు కుళ్ళికంపు కొడుతూంది. వెనువెంటనే దీనిని తొలగించవలసియున్నది. పరిశ్రమలకు ఆర్థిక సహాయం అవసరమనే పేరుతో దీనిని అట్టిపెట్టడం క్షంతవ్యంగాదు" అని చెప్పారు.

2. మార్కెటింగ్ అసోసియేషన్లు :

ఇవి యీ మధ్య కాలంలో యేర్పాటు చేయబడ్డాయి. తమలో తాము ధరలు వగైరాల విషయంలో పోటీలేకుండా చేసుకునేందుకు, ప్రభుత్వంతో బేరమాడి ఎక్కువధరలు తెచ్చుకునేందుకు (ప్రభుత్వం ధరలు కంట్రోల్ చేస్తున్న సరుకుల విషయంలో) ఒకే ఒక వేతనాల విధానంతో సంఘటిత కార్మికశక్తుల నెదుర్కొనేందుకు యివి ఏర్పరచబడుతున్నాయి. ఈపాటికి అనేక పరిశ్రమలలో యిలాంటివి ఏర్పడి పనిచేస్తున్నాయి. తేయాకు మార్కెటింగ్ విస్తరణ బోర్డు, సిమెంటు మార్కెటింగ్ బోర్డు, పంచదార సిండికేట్, వనస్పతి ఉత్పత్తిదారుల అసోసియేషన్, బిస్కట్, రేడియో, పంకా ఉత్పత్తిదారుల అసోసియేషన్లు వగైరాలు యిందుకు ఉదాహరణలు.

ఈ సంస్థల ఒడంబడికలు రహస్యంగా ఉంచబడుతున్నాయి. కాని యీ పరిశ్రమలలో ధరల పోటీ లేకపోవడాన్ని చూచినా, మార్కెట్‌లో ఒకేధర చెప్పడంచూచినా యివి యెంత సుసంఘటితంగా నిర్వహించబడుతున్నాయో అర్థమవుతుంది. అంతేగాక ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చి ఎప్పటికప్పుడు ఉక్కు, బొగ్గు, సిమెంటు వగైరా ధరలను ఎలా పెంచుకోగలుగుతున్నారో చూస్తూనే ఉన్నాము.

ఈ సంస్థ లేర్పడి పనిచేస్తున్న కారణానే భారత వినిమయదారులు ఉక్కు, బొగ్గు, సిమెంటు, సబ్బు, రేడియో, విద్యుత్ పంకాలు, బిస్కట్లు, వనస్పతి నూనెలు వగైరా సరుకులకు రానురాను యెక్కువధరలు చెల్లించు కోవలసి వస్తూంది.

మన దేశంలో పై విధంగా యేర్పడిన గుత్తసంస్థలలో ప్రత్యేకించి చెప్పుకోవలసినవి, 250 పరిశ్రమలపైన పెత్తనంగల 9 ప్రముఖ బ్రిటిష్ సంస్థలు, 220 పరిశ్రమలను నిర్వహిస్తున్న 11 భారతీయ సంస్థలు ఉన్నాయి. మాక్లియాడ్స్, మార్టిన్ - బరన్, జార్డెన్ హెండర్సన్, డంకన్, ఆండ్రూయూల్, ఆక్టేవియస్ స్టీల్, గిలాండర్స్, బర్డ్ అనే బ్రిటిష్ కంపెనీలు; తాతా, బిర్లా, జగ్గీలాల్ కమలాపట్ (జె. కె. గ్రూపు), దాల్మియా, సింఘానియా, థాపర్స్, గోయెంకా, వాల్ చంద్, నరాంగ్, సెక్సారియా, పొద్దార్స్ అనే భారతీయ కంపెనీలు అన్నింటికన్నా పెద్దవి.

## బ్యాంకులపై పెత్తనం

పైన చెప్పిన కొద్దిమంది గుత్త మేనేజింగ్ ఏజెంట్లే తిరిగి మన బ్యాంకులలో అధికభాగంపైన పెత్తనం వహిస్తున్నారు. 1955 రిజర్వు బ్యాంకు లెక్కల ప్రకారం మన దేశంలో అన్నింటికన్న పెద్ద బ్యాంకులు (షెడ్యూల్డు) 9 ఉన్నాయి. (1) స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా, (2) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, (3) యునైటెడ్ బ్యాంకు ఆఫ్ ఇండియా, (4) యునైటెడ్ కమర్షియల్ బ్యాంకు, (5) బ్యాంకు ఆఫ్ బరోడా, (6) పంజాబ్ నేషనల్ బ్యాంకు, (7) అలహాబాద్ బ్యాంకు (8) బ్యాంకు ఆఫ్ రాజస్థాన్, (9) ఇండియన్ బ్యాంకు.

ఈ 9 బ్యాంకులు కలిపి మొత్తం భారతదేశంలోగల జాయింట్ స్టాక్ బ్యాంకులయొక్క చెల్లించిన మూల ధనంలో 45.7 శాతం, రిజర్వు నిధులలో 62.3 శాతం, డిపాజిట్లలో 72 శాతం కలిగియున్నాయి. నికర లాభాలలో 72.8 శాతం సంపాదించాయి.

ఈ బ్యాంకులపైన పెత్తనం తిరిగి పైన చెప్పిన గుత్త పెట్టుబడిదారు లదే. తాతాకు సంబంధించిన డైరెక్టర్లు సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, బ్యాంకు ఆఫ్ ఇండియా, బ్యాంకు ఆఫ్ బరోడాలలో ఉన్నారు. బిర్లాకు సంబంధించినవారు యునైటెడ్ కమర్షియల్ బ్యాంకు, బ్యాంకు ఆఫ్

బరోడాలలో ఉన్నారు. దాల్మియాకు సంబంధించినవారు పంజాబ్ నేషనల్ బ్యాంకులోను, అలాగే గోయెంకా కుటుంబీయులు యునైటెడ్ కమర్షియల్ బ్యాంకులోను ఉన్నారు.

## పెట్టుబడి కేంద్రీకరణ

వీరి చేతులలో పెట్టుబడి కేంద్రీకరణకూడా విపరీతంగా జరిగింది. పన్నుల పరిశీలనా కమిటీ రిపోర్టు ప్రకారం 1951-52 వ సం॥ నాటికి మన దేశంలోగల జాయింట్ స్టాక్ కంపెనీలు మొత్తం చెల్లించిన పెట్టుబడిలో 7189 చిన్న కంపెనీలకు 15.1 శాతం, మొత్తం కంపెనీలలో 0.7 శాతంగా ఉన్న 60 పెద్ద కంపెనీలకు 27.4 శాతం, మొత్తం కంపెనీలలో 2 శాతంగా ఉన్న 174 పెద్ద కంపెనీలకు 42.2 శాతం పెట్టుబడులున్నాయి. ఆ యా పరిశ్రమలను తీసుకుంటె జౌళిపరిశ్రమలలోగల 470 లిమిటెడ్ కంపెనీలలోను 9.3 శాతంగా ఉన్న 44 కంపెనీలు మొత్తం పెట్టుబడిలో 44 శాతం కలిగి యున్నాయి. జూట్ పరిశ్రమలలో మొత్తం 85 కంపెనీలలోను 17 కంపెనీలు 2/5 వ వంతు పెట్టుబడిని, బొగ్గు పరిశ్రమలలో 5 కంపెనీలు మొత్తం పెట్టుబడిలో 27.9 శాతం పెట్టుబడిని, ఇంజనీరింగ్ పరిశ్రమలలోగల 581 కంపెనీలలో 18 కంపెనీలు 50 శాతం పెట్టుబడిని కలిగియున్నాయి. ఈవిధంగా కొద్ది గుత్త సంస్థల ఆధిపత్యానగల కొద్ది పెద్ద కంపెనీలు మన పరిశ్రమలలో అధికభాగం పెట్టుబడిని కలిగియున్నాయి.

1948-55 సం॥ మధ్య మన పరిశ్రమలలో రు. 680 కోట్ల నూతన పెట్టుబడి ప్రవేశించిందిగాన, గుత్త యాజమాన్యం పోయిందనే వాదన ఉన్నది. కాని యీ రు. 680 కోట్లలోను రు. 420 కోట్లు (61.8 శాతం) పాత గుత్త సంస్థలే పాత సంస్థలలో పెట్టాయి. మిగిలిన రు. 260 కోట్ల లోనూ 60 శాతం పెట్టుబడి తిరిగి వీరే నూతన పరిశ్రమలలో పెట్టారనే విషయం గమనించాలి.

ఈ విధంగా కొద్దిమంది పారిశ్రామికాధిపతులే బాంకుల అధిపతులు గానూ పెట్టుబడుల అధిపతులుగాను కూడ తయారయ్యారు. పారిశ్రామిక, బాంకింగ్ పెట్టుబడులు సంలీనమయిపోయాయి. డాక్టర్ యమ్. యమ్. మెహతా పైన చెప్పిన తన గ్రంథంలో పేర్కొన్నట్లు "ఈ విధంగా

ఆచరణలో మన దేశంలోని పరిశ్రమలయొక్క జీవనాడులను నడుపుతూ పెత్తనం వహించేది కొద్దిమంది గుత్త కుటుంబాలే"నని తేలుతుంది.

1955 లో పార్లమెంటు ఆమోదించిన కంపెనీల చట్టం మేనేజింగ్ ఏజెన్సీలను అదుపులో పెట్టుటకు కొంత ప్రయత్నిస్తూంది. కంపెనీల చట్టం ప్రకారం (1) ఏ ఒక్క డైరెక్టరు 20 కంపెనీలకన్న యెక్కువ కంపెనీలలో డైరెక్టరుగా ఉండకూడదు. (2) 1960 ఆగస్టు 15 తర్వాత ఏ మేనేజింగ్ ఏజెంటు 10 కంపెనీలకన్న యెక్కువ మేనేజ్ చేయుటకు వీలుండదు. (3) మేనేజింగ్ ఏజెంట్లకిచ్చే రెమ్యూనరేషన్ కంపెనీ యొక్క నికర లాభాలలో 10% కు మించరాదు!

ఈ పద్ధతులు సక్రమంగా అమలు జరిగితే కొంత మేలు జరిగేమాట నిజమే. కాని చట్టంలోని కొన్ని లోపాల నుపయోగించుకొని దోపిడీ త్రోవన పెత్తనం వహించేందుకు చాలా అవకాశా లున్నాయి. (1) మేనేజింగ్ ఏజెంట్లు మిగిలిన ఫరములకు కార్యదర్శులుగాను, ట్రెజరర్లుగాను పనిచేయవచ్చు. (2) తమ చుట్టాలు, పక్కాల మధ్య పంపకాలుచేసి అనేక పేర్లతో వ్యవహరించవచ్చు. ఉ॥ బిర్లాగారు, బి. యస్. బిర్లా యం. పి. బిర్లా వగైరా బిర్లాల పేర్లతో విభజించుకొని పెత్తనం వహించవచ్చు. (3) ఒక పరిశ్రమయొక్క శాఖలుగా మిగిలిన కొన్ని పరిశ్రమలను నమోదు చేయించుకోవచ్చును. బిర్లాగారు ఒక జూట్ మిల్లుకు శాఖగాఒక సిమెంట్ ఫ్యాక్టరీ నమోదు చేయించారట !

ఐతే కంపెనీల చట్టంలోనే ప్రభుత్వం ఏ పరిశ్రమనైనా నోటిఫై చేసి ఆ తేదీనుండి 3 సంవత్సరముల తర్వాత మేనేజింగ్ ఏజెంటు ఉండ కూడదని నిర్ణయించే అధికారమున్నది. ప్రభుత్వం దీని నమలు జరుపుతుందో లేదో చూడవలసియున్నది.

## గుత్త ధరలు :

ఈ గుత్త సంస్థలు తమ గుత్త యాజమాన్యం వలననూ, మార్కెటింగ్ అసోసియేషన్ల ద్వారా పోటీలేకుండా నివారించుకోవడంద్వారానూ క్రమంగా తమ సరుకుల ధరలను పెంచేస్తూండడం చూస్తూనేవున్నాము. జూట్, తేయాకు, రబ్బరు వగైరాల ధరలు ప్రతి సంవత్సరము యెలా పెరుగుతున్నాయో చూస్తూనే వున్నాము. ఉదాహరణకు రబ్బరు

కంపెనీలు తమ సరుకుల ధరలను 1946 లో 21.79 శాతం, '47 లో 18.90 శాతం, '48 లో 15.26 శాతం, '52 లో 11.24 శాతం, '53 లో 8.52 శాతం పెంచుతూ వచ్చారు.

ప్రధాన పరిశ్రమలైన బొగ్గు, ఉక్కు, సిమెంటు, పంచదార, బట్టలు వగైరాల ధరలను కొంతవరకు కంట్రోల్ చేసే హక్కు ప్రభుత్వాని కున్నది. అయినా ఆచరణలో ప్రభుత్వం పారిశ్రామికాధిపతులకు లొంగి పోయి వారికి అధికలాభాలు కట్టబెట్టే పద్ధతిలోనే ధరలను నిర్ణయిస్తూంది. ఉ॥ 1956 మే లో ట్రిబ్యునల్ తీర్పు ననుసరించి బొగ్గుపరిశ్రమలో కార్మికుల జీతాలు పెంచవలసి వస్తే బొగ్గుధర టన్నుకు రు. 3/- పెంచేందుకు ప్రభుత్వం అనుమతించింది. అలాగే యినుము, ఉక్కు పరిశ్రమలలో ఏదో యొక సాకుతో మాటిమాటికి ధరలు పెంచేందుకు అంగీకరించింది. ఉదా॥ టాటా ఉక్కుకంపెనీ; ఇండియా ఉక్కు, యినుము కంపెనీలు 1948 లో టన్నుకు రు, 28-8-0, 1949 లో రు. 18-0-0, 1951 లో రు. 33-0-0, 1955 లో రు. 54-0-0, గత సంవత్సరం రు. 12-0-0, యీసంవత్సరం మొన్న మొన్న రు. 14/- రిటెన్షన్ ధర పేరుతో తమ సరుకుల ధరలు పెంచాయి.

## గుత్తలాభాలు

ఇక గుత్తపెట్టుబడిదారుల లాభాలుకూడా అంతులేకుండా పెరిగి పోతున్నాయి. రెండవ ప్రణాళికా లక్ష్యాలలో ప్రజల ఆదాయము, సంపదలయందుగల వ్యత్యాసములను తగ్గించి ఆర్థికశక్తిని సమానముగా పంచి పెట్టాలని చెప్పబడింది. కాని యిది ఆచరణలో బూటకంగా తయారయింది. గుత్తపెట్టుబడిదారుల లాభాలు క్రమంగా పెరుగుతూండడమే యిందుకు నిదర్శనం.

1950 లో మన దేశంలోని ఫ్యాక్టరీ లన్నింటియొక్క నికర లాభాల మొత్తం రు. 550 కోట్లున్నది. 1954 నాటి కది రు. 760 కోట్లకు పెరిగింది. 1953-'54 లో 9933 కంపెనీలకు మొత్తం 219.95 కోట్ల రూపాయలు లాభం వస్తే, దానిలో 78% అంటే 174.58 కోట్ల రూపాయలు 775 కంపెనీలకు వచ్చింది. ఈ 775 లో తిరిగి 62 పెద్ద కంపెనీలకు 43.01 కోట్ల రూపాయలు అంటే మొత్తం నికర లాభంలో 5 వ వంతు వచ్చింది.

బట్టల పరిశ్రమలలో వచ్చిన మొత్తం లాభంలో 35 శాతం 15 కంపెనీలు సంపాదించాయి. తేయాకు పరిశ్రమలలో 4 బ్రిటిష్ కంపెనీలు సంవత్సరానికి సగటున 1½ కోట్ల రూపాయల లాభం సంపాదిస్తున్నాయి. గిలాండర్స్ ఆర్బత్ నాట్ కంపెనీకి 1944-'54 మధ్యకాలంలో 1.99 కోట్ల రూపాయల లాభం వచ్చింది. కలకత్తా ఎలెక్ట్రికల్ సప్లయి కార్పొరేషన్‌కు 1955 లో దాదాపు 2 కోట్ల 40 లక్షల రూపాయల లాభం వచ్చింది. అలాగే డన్‌లప్ రబ్బరు కంపెనీ 1948-'53 సంవత్సరాల మధ్య కాలంలో 7.6 కోట్ల రూపాయల లాభం సంపాదించింది.

స్వాతంత్ర్యానంతరం గుత్త పెట్టుబడిదారుల లాభాలు యెలా పెరిగాయో యీ క్రింది టేబిల్ స్పష్టంగా తెలియజేస్తుంది:

| | | (కోట్ల రూపాయలలో) | |
|---|---|---|---|
| | | 1948 | 1953 |
| అసోసియేటెడ్ సిమెంట్స్ | ... | 1.20 | 2.09 |
| టెక్స్‌మెకో (బిర్లా) | ... | 3.99 | 9.95 |
| టిస్కో (టాటా) | ... | 1.50 | 1.93 |

ఈ లాభాలను పరిశీలించినపుడు ఒక విషయం స్పష్టంగా అర్థమవుతుంది. స్వతంత్రం వచ్చాక, మొదటి ప్రణాళిక ప్రారంభమైన తరువాత, గుత్త పెట్టుబడిదారుల లాభాలు మరింత ఎక్కువయ్యాయి. ప్రభుత్వ కంట్రోళ్ళు నామకః తయారయ్యాయి. ఆర్థిక అసమానత్వాన్ని తగ్గించుటకు కృషిచేస్తున్నామనే మాటలు బూటకాలని తేలుతుంది.

## గుత్త యాజమాన్యము - జాతీయ ప్రయోజనాలు

పైన వివరించినదానినిబట్టి మన దేశంలోని గుత్త పెట్టుబడిదారీ సంస్థల అభివృద్ధి, యే యితర అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలకు తీసిపోని విధంగా, తగినంత పెద్ద ఎత్తునే జరిగిందని స్పష్టమవుతుంది. ఈ గుత్త యజమానులు జాతీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకునిగాక తేలికగా ఎక్కువలాభం వచ్చే పరిశ్రమలలో మాత్రమే పెట్టుబడి పెడుతున్నారు. లాభాల తృష్ణతో ధరలను విపరీతంగా పెంచివేస్తున్నారు. కొన్నిచోట్ల సాంకేతికాభివృద్ధికికూడా, ముఖ్యంగా గనుల పరిశ్రమలలో అడ్డుపడు

తున్నారు. తమ చేతులలో పోగుపడుతున్న అదనపు విలువలో అధిక భాగాన్ని దేశ ప్రయోజనాలకు వినియోగించుటకు మారుగా దాదాపు 50 శాతంవరకు వాటాదారుల సభ్య పంచివేస్తున్నారు. విదేశీ గుత్త సంస్థలు తమ నికరలాభాలలో అధికభాగం తమ దేశాలకు తరలించుకుపోతున్నాయి. ఈవిధంగా మన దేశ ప్రయోజనాలకు భిన్నంగా యీ గుత్త యజమానులు వ్యవహరిస్తున్నారు.

అంతేగాదు, ప్రభుత్వంలోను, రాజకీయవేత్తలలోను వీరికి మంచి పలుకుబడి వున్నది. ప్రభుత్వ విధానాలను తమ కనుకూలంగా చేసుకోగల శక్తి వుంది. అసంఖ్యాక ప్రచారంగల తమ పత్రికలద్వారా ప్రజాభిప్రాయాన్ని తీర్చి దిద్దగల శక్తికూడా వీరికి ఉంది. జమ్‌షెడ్‌పూర్‌లో తాతా యినుము ఉక్కు కంపెనీ పనివారు సమ్మె చేసిన సందర్భంలో యీ విషయం స్పష్టంగా తెలియవచ్చింది. తాతా తన పలుకుబడితో కేంద్ర ప్రభుత్వాన్ని నోరుమెదపకుండా చేయగలిగాడు. పత్రికలు తన ప్రకటనలను తప్ప యితర సంస్థలు, కార్మికసంఘాలు యిచ్చిన యథార్థ ప్రకటనలను ప్రచురించకుండా చేయగలిగాడు. కార్మికులపైన రాష్ట్ర ప్రభుత్వంచే భయంకరమైన దాడి చేయించాడు.

పరిస్థితులను యిలాగే కొనసాగనిస్తే మన ప్రభుత్వం ప్రకటించిన సోషలిస్టులక్ష్యానికి, ప్రజాస్వామ్యానికీ కూడా ముప్పురాక తప్పదు. కాబట్టి ప్రభుత్వం యీసంస్థలను అదుపులో పెట్టేందుకు తగినచర్యలు సత్వరమే తీసుకోనేటట్లు ప్రజాఉద్యమం కృషి చేయాలి.

ప్రజాస్వామికోద్యమం ప్రభావంవలన ప్రభుత్వం వీరిని అదుపులో పెట్టుటకు కొన్ని చర్యలు తీసుకున్నా అవిచాలా అసమగ్రంగాను, లోప భూయిష్టంగాను ఉన్నాయి. తత్ఫలితంగా గుత్త యజమానుల అధికారం కుంటుపడకుండానే సాగుతూంది.

గుత్త ఆధిపత్యాన్ని అదుపులోపెట్టి దేశప్రయోజనాలను కాపాడాలన్నా, ఆర్థికాభివృద్ధిని సాధించాలన్నా యీ క్రింది చర్యలు అవసరమవుతాయి: (1) కొన్ని కీలక పరిశ్రమలను ప్రభుత్వపరం చేయవలసియుంటుంది. (2) మేనేజింగ్ ఏజెన్సీ పద్ధతికి తక్షణమే స్వస్తిచెప్పాలి. (3) బ్యాంకులు, జనరల్ యిన్సూరెన్సు, బ్రిటిష్ ఆధిపత్యంగల జూట్ మిల్లులు, తేయాకు

తోటలు, అల్యూమినియం, యినుపరాయి, రాగి, యినుపగనులను జాతీయం చేయాలి. (4) ప్రయివేట్ రంగంలోని పరిశ్రమలపైన ఖచ్చితమైన పర్యవేక్షణ ఉండాలి. (5) పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాల కనుగుణ్యంగా ప్రయివేట్ రంగం పనిచేసేటట్లు చూడాలి (6) వాడకం వస్తువుల పరిశ్రమలలో పెట్టే పెట్టుబడులను పరిమితం చేయాలి. వాటి కిచ్చే కోటాలను తగ్గించాలి. (7) వనరులను పొదుపుచేసి, పన్నులువేసి, నిర్బంధ రుణాలు సేకరించి ప్రభుత్వ రంగానికి సమకూర్చాలి.

గుత్తదారుల పెట్టుబడులకు పరిమితులేర్పరచుట, వారి లాభాలకు గరిష్ట పరిమితులను విధించుట, బోనస్ వాటాలను, చట్టా వ్యాపారాన్ని నిషేధించుట, సరియైన ధరల విధానా న్నవలంబించుట, పనివారల న్యాయమైన కోర్కెలను గుత్తపెట్టుబడిదారులు అంగీకరించునట్లు చేయుట మొదలైన చర్యలద్వారా యిదివరకే ఉత్పన్నమైన ఆర్థిక కేంద్రీకరణను విచ్ఛిన్నం చేయవలసి యుంటుంది. అదేవిధంగా ప్రయివేట్ రంగంకన్న ప్రభుత్వ రంగం చాలా వేగంగా పెంపొందేటట్లు, జాతీయార్థిక జీవనంలో దానికి ప్రధాన నిర్ణాయక పాత్ర ఉండేటట్లు చూడాలి. ఉక్కు కర్మాగారాలు, నౌకా నిర్మాణం, రసాయనిక పదార్థాలు, చమురు, బొగ్గు, ఖనిజాలు, విద్యుచ్ఛక్తి మొదలగు భారీ యంత్రాగారాల నిర్మాణానికి ప్రాముఖ్యత నివ్వాలి. రక్షణ పరిశ్రమను బాగా వృద్ధిపరచి విదేశాలమీద ఆధారపడడం మానాలి.

## పారిశ్రామిక కార్మికులు - ప్రభుత్వ విధానాలు

ఇంతవరకు మన ఆర్థికవ్యవస్థలో ఒక ప్రధానాంగమైన పెట్టుబడిదారులు, వారియొక్క పాత్ర, వారియెడల ప్రభుత్వం అవలంబిస్తున్న వైఖరి, వారికి కలిగిస్తున్న సౌకర్యాలు వగైరాలను పరిశీలించాము. ఇపుడు గత్యంతరంలేక తమ శ్రమశక్తిని పెట్టుబడిదార్ల కమ్ముకుని ఉత్పత్తికి మూల స్థంభాలుగా వుంటున్న పారిశ్రామిక కార్మికవర్గంయొక్క స్థితిగతులు, వారియెడల ప్రభుత్వ విధానాలను గురించి పరిశీలించవలసి యున్నది.

**1956** నాటికి మన దేశంలో వివిధ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికుల సంఖ్య యీ క్రింది విధంగా ఉన్నది :

| పరిశ్రమలు | | సంఖ్య |
|---|---|---|
| ఫ్యాక్టరీలలో | ... | 25,28,026 |
| గనులలో | ... | 5,93,868 |
| పోస్టు, టెలిగ్రాఫ్ శాఖలో | ... | 2,41,807 |
| కాఫీ, టీ, రబ్బరు తోటల్లో | ... | 12,28,335 |
| రైల్వేలలో | ... | 9,66,185 |
| పెద్ద ఓడరేవులలో | ... | 49,793 |
| మ్యునిసిపాలిటీలలో | ... | 1,87,041 |
| కేంద్ర, రాష్ట్ర పి. డబ్ల్యు. డి. శాఖల్లో | | 4,08,190 |
| స్టేట్ రవాణా శాఖల్లో | ... | 46,137 |
| నావికులు | ... | 59,640 |

## మొదటి పంచవర్షప్రణాళిక - కార్మిక విధానాలు

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో కార్మికులు దేశాభివృద్ధి కార్యక్రమాలలో తమవంతు కర్తవ్యాన్ని నెరవేర్చారు. జాతీయాదాయాన్ని 18.4 శాతం పెంచుటలోను, పారిశ్రామికోత్పత్తిని 107.2 నుండి 153.6 కు పెంచుటలోను గణనీయమైన కృషిచేశారు. మన కార్మికులయొక్క ఉత్పాదన శక్తికూడా 78.8 నుండి 113.0 వరకు (43 శాతం) పెరిగిందని ప్రభుత్వ లెక్కలే తెలుపుతున్నాయి. పారిశ్రామికోత్పత్తితో పాటు పెట్టుబడిదారుల లాభాలుకూడా విపరీతంగా పెరిగాయి. 1950 లో మొత్తం పరిశ్రమలలోని నికరలాభాలు రు. 550 కోట్లు నుండి 1954 నాటికి రు. 760 కోట్లకు పెరిగాయి. (వివరాలకు గత అధ్యాయంలో గుప్తలాభాలు అనే శీర్షిక క్రింద చూడగలరు). ఈవిధంగా పారిశ్రామికోత్పత్తి, కార్మికుల ఉత్పాదకశక్తి, పెట్టుబడిదారుల లాభాలు అన్నీ పెరిగినా కార్మికులయొక్క జీతాల బిల్లుమాత్రం రు. 193 కోట్లనుంచి రు. 207 కోట్లకు మాత్రమే పెరిగింది. ఇతర ఉద్యోగస్థుల జీతాల బిల్లు రు. 39 కోట్లనుండి రు. 42 కోట్లకు పెరిగింది. ఈ విధంగా మొత్తం నికర ఆదాయంలో గుప్త పెట్టుబడిదారుల భాగం 57% నుంచి 67% వరకు పెరిగితే కార్మికుల, ఉద్యోగస్థుల భాగం 43% నుంచి 33% కు తగ్గిపోయింది.

జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శియైన శ్రీ త్రిపాఠీ పార్లమెంటులో చెప్పినట్లు, "కార్మికవర్గం ప్రణాళికను జయప్రదం చేయుటకు కృషిచేశారు. వారి స్వప్రయోజనాల దృష్ట్యానే కాకుండా, సంఘ శ్రేయస్సు దృష్ట్యాకూడా వారికి న్యాయం కలుగుతుందని ఆశించారు. కాని వేతనాల విషయంలో తగిన అభివృద్ధిలేదు." ఈ క్రింది పట్టికను పరిశీలించండి.

| సంవత్సరం | ఉద్యోగం | ఉత్పత్తి రేటు | ఉత్పాదక శక్తి రేటు | అసలు వేతనాల రేటు |
|---|---|---|---|---|
| 1939 | 100 | 100 | 100 | 100 |
| 1950 | 136.0 | 107.2 | 78.8 | 90.1 |
| 1951 | 135.7 | 120 4 | 88.7 | 92.1 |
| 1952 | 136.7 | 132.2 | 97.4 | 101.8 |
| 1953 | 133.1 | 140.8 | 105.8 | 99.9 |
| 1954 | 135.9 | 153.6 | 113.0 | 102.2 |

పై వివరాలనుబట్టి కార్మికుల అసలు వేతనాలు 1939 తో పోలిస్తే 2.2 శాతం మాత్రమే పెరిగాయని స్పష్టమవుతుంది. సాధారణ ప్రజలతో పాటు కార్మికులపైన యీ 5 సంవత్సరాలకాలంలోను ప్రభుత్వం విధించిన అనేక ప్రత్యక్ష, పరోక్ష పన్నులు మినహాయిస్తే కార్మికుల జీతాలు యింకా తక్కువగానే వుంటాయి.

ఈ విధంగా కార్మికుల అసలు జీతాలు పెరగకపోవుటకు, వారి జీవన స్థాయి అభివృద్ధి గాకపోవుటకు ప్రధాన కారణమేమిటి? ప్రభుత్వ వేతనాల విధానమే యిందుకు ప్రధాన కారణం. మొదటి ప్రణాళికా కాలంలో ప్రభుత్వం "వేజ్ ఫ్రీజ్" (వేతనాలు ఎక్కడివక్కడే ఉండాలనే) విధానాన్ని అమలు జరిపింది. కార్మికుల జీతాలు పెరిగితే ధరలు పెరుగుతాయనీ, నోట్ల ముద్రణం ఎక్కువవుతుందనే పేరుతో వేతనాల పెంపుదల యెడల విముఖత చూపించింది. బొంబాయి బట్టలమిల్లు కార్మికులు పోరాడి సాధించుకున్న బోనస్‌ను స్టేట్ బాండులలోనికి మార్చ ప్రయత్నించడం, బొగ్గుగని కార్మికుల వేతనాల సమస్య వచ్చినపుడు ట్రిబ్యునల్ యెదుట ప్రభుత్వ ప్రతినిధులు వ్యతిరేకంగా వాదించడం, ప్రభుత్వ

డిపార్టుమెంటులోని కార్మికులు జీతాల పెరుగుదలకోసం పోరాడినపుడు వారి నణచివేసి జీతాలు పెంచ నిరాకరించడం, ధరలు పెరిగినా కరువుభత్యాన్ని పెంచేందుకు అంగీకరించకపోవడం యివన్నీ ప్రభుత్వ వైఖరికి నిదర్శనలు. బ్యాంకు ఉద్యోగస్థుల విషయంలో యీ వైఖరి కళ్ళకు కట్టినట్లు బహిర్గత మయింది. లేబర్ అప్పిలేట్ ట్రిబ్యునల్ యిచ్చిన కొద్దిపాటి సౌకర్యాలు కూడా యివ్వకుండా ఆ అవార్డును కాస్తా మార్చివేసిన ఉదంతం జగద్విదితమే.

కాని రెండవ వైపున ప్రభుత్వం, పెట్టుబడిదారులు యథేచ్ఛగా రేషనలైజేషన్, శ్రమ తీవ్రతను హెచ్చించుట, పనిభారాన్ని పెంచుట వగైరా పద్ధతులద్వారా కార్మికులను దోపిడీ చేసేందుకు పూర్తి అవకాశ మిచ్చింది. అనేక బట్టలమిల్లులలోను, జూట్, యింజనీరింగ్ పరిశ్రమల లోను, ఉక్కు పరిశ్రమలోను యీ రేషనలైజేషన్ వగైరా పద్ధతుల నవ లంబించి పనిభారాన్ని పెంచుట జరిగింది. ఈ విధానానికి వ్యతిరేకంగా కార్మికులు పోరాటాలు జరిపినపుడు ప్రభుత్వం గుత్త యజమానుల పక్షం వహించి పోరాటాల నణచేందుకే తోడ్పడింది. పైగా గుత్త పెట్టుబడిదారు లకు యీ విధానాల నమలు జరిపేందుకు పారిశ్రామికాభివృద్ధి పేరుతో రు. 50 కోట్లు సహాయం చేసింది.

ఈ విధానాలకు వ్యతిరేకంగా కార్మికులు దేశమంతటా అనేక పోరాటాలు నడిపారు. ఈ క్రింది పారిశ్రామిక తగాదాల సంఖ్యా వివ రాలను పరిశీలిస్తే కార్మికులు ఎంత తీవ్రంగా యీ విధానాలను ప్రతిఘటిం చారో అర్థమవుతుంది.

పారిశ్రామిక తగాదాల వివరాలు

| సంవత్సరం | తగాదాల సంఖ్య | తగాదాలో ఉన్న కార్మికుల సంఖ్య | పని - రోజుల నష్టం |
|---|---|---|---|
| 1951 | 1,071 | 6,91,321 | 38,18,928 |
| 1952 | 963 | 8,09,282 | 33,31,967 |
| 1953 | 772 | 4,66,607 | 33,82,608 |
| 1954 | 840 | 4,77,138 | 33,72,630 |
| 1955 | 1,166 | 5,27,676 | 56,97,846 |

కార్మికుల ప్రతిఘటనను అణచివేందుకు ప్రభుత్వం ప్రతి పోరాటంలోను జోక్యం కల్పించుకుని తీవ్ర నిర్బంధ విధానాన్ని అమలు జరిపింది. 144 సెక్షన్ ప్రయోగం, విచక్షణారహితమైన లాఠీచార్జీలు, బాష్పవాయు ప్రయోగాలు, కాల్పులు, అరెస్టులు వగైరాలన్నీ సాగించింది. ప్రభుత్వ శాఖలలో సెక్యూరిటీ పేరుతో ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలను బర్తరఫ్ చేసింది. స్వతంత్ర కార్మిక సంఘాలను గుర్తించ నిరాకరించింది.

క్లుప్తంగా చెప్పాలంటే గుత్తవ్యాపారుల లాభాల దాహాన్ని తీర్చడం, కార్మికులపై పనిభారాన్ని పెంచి కొంతమందిని నిరుద్యోగులను చేయడం, జీతాల పెరుగుదలను నిరాకరించడం, ట్రేడ్‌యూనియన్ హక్కులపై దాడిచేయడం, నిర్బంధ విధానం - యివే మొదటి ప్రణాళికలో ప్రభుత్వ కార్మిక విధానమని చెప్పవచ్చు.

## రెండవ పంచవర్ష ప్రణాళికలో కార్మిక విధానాలు

మన దేశంలో కార్మికోద్యమం చాలాకాలంగా కార్మికుడు మానవుడుగా జీవించుటకు అవసరమైన వేతనం (Living wage) కొరకు ఆందోళన చేస్తూంది. పెట్టుబడిదారులు కనీస జీతం (Minimum wage) నిర్ణయించాలని వాదిస్తూ వస్తున్నారు. ప్రభుత్వంచే నియమించబడిన సరస వేతనకమిటీ కుటుంబసంఖ్యను 3.0 గా నిర్ణయిస్తూ, వారి బ్రతుకుకు అత్యవసరమైన దానికన్న యితర సౌకర్యాలు కూడా స్వల్పంగా వుండేట్లు సరస వేతనం (Fair wage) నిర్ణయించాలని సూచించింది. అదేవిధంగా కేంద్ర నిర్ణాయకసంఘం కూడా కొన్ని ముఖ్యసూత్రాలను ప్రతిపాదించి, వాటిప్రకారం దేశవ్యాపితంగా కనీస వేతనాలను వివిధ తరగతుల కార్మికులకు నిర్ణయించింది.

కాని ప్రభుత్వం యింతవరకు యీ సూచనలను అమలుజరుపలేదు. జాతీయ కనీస వేతనాన్ని (National minimum wage) రూపొందించనే లేదు. దానిలో వివిధ రాష్ట్రాలలో రాష్ట్ర ప్రభుత్వాలు కనీస వేతనాల చట్టం ప్రకారం తమ యిష్టంవచ్చిన వేతనాలను నిర్ణయించడం, ట్రిబ్యునల్స్ తమ యిష్టంవచ్చిన తీర్పులు యివ్వడం జరుగుతూంది. ఈ సత్యాన్ని ప్రభుత్వం కూడా గుర్తించి రెండవ ప్రణాళికలో పేర్కొన్నది.

కాని రెండవ ప్రణాళికలో ప్రభుత్వం రూపొందించిన వేతనాల విధానం యీ విషయాన్ని విస్మరించింది.

రెండవ ప్రణాళికలో ప్రభుత్వ వేతనాల విధానం యీ క్రింది విధంగా ఉంటుందని చెప్పబడింది: (1) మార్జినల్ యూనిట్లు (అధిక సౌష్టవం వుండీవుండని పరిశ్రమలు) వున్నందువల్ల సరసవేతనాలను అమలు జరపడం కష్టసాధ్యం. (2) నేడున్న జీతాలకు సంబంధించిన సమాచారం సంపూర్ణంగా సేకరించబడలేదు. కనుక, జీతాల నిర్ణయానికి అవసరమైన సూత్రాలను సూచించే నిమిత్తం జీతాల కమిషన్‌ను నియమించడం అవసరం. ప్రస్తుతం జీతాల వివరాలను సేకరించడం మాత్రమే అవసరం. నేడు వివిధ ప్రాంతాలలో జీవన వ్యయ ప్రమాణానికి సంబంధించిన వివరాలను సేకరించి సరిచేయడం అవసరం. (3) జీతాలను పెంచడం ఉత్పాదన శక్తిని పెంచడాన్ని బట్టి ఆధారపడి వుంటుంది. (4) ఉత్పత్తి ఫలితాలను బట్టి జీతాలను నిర్ణయించాలి. అనగా కాలాన్ని బట్టి యిచ్చే కనీస జీతం కాకుండా, అదే కాలంలో అదనంగా చేసిన పనిని బట్టి కొంత అదనపు కూలి యివ్వడం. (5) పారిశ్రామిక ట్రిబ్యునల్స్ పార్టీలకు సంతృప్తికరమైన పద్ధతుల్లో జీతాలను నిర్ణయించడంలేదు. కాబట్టి, త్రైపాక్షిక జీతాల బోర్డులను నియమించాలి. వీటిల్లో కార్మికుల, యజమానుల ప్రతినిధులు సమ సంఖ్యలో వుండి ఒక స్వతంత్రుని అధ్యక్షత క్రింద పనిచేయాలి. (6) బోనసు, లాభాల పంపకం విషయంలో ప్రస్తుతం సూత్రాలను నిర్ణయించడం కష్టతరంగా బట్టి, యీ విషయాలపై తగాదాలను ట్రిబ్యునల్సే పరిష్కారం చేస్తాయి. వీటిని కొంచెం జాగ్రత్తగా పరిశీలించడం అవసరం.

**త్రైపాక్షిక జీతాల బోర్డులు :**

జీతాల నిర్ణయాని కవసరమైన ప్రాథమిక సూత్రాలను ముందు నిర్ణయించకుండా యీ బోర్డులు సక్రమంగా జీతాలు నిర్ణయించడం సాధ్యం గాదు. ఉదాహరణకు మద్రాస్ రాష్ట్రంలో బట్టల, నూలు మిల్లులలో కార్మికుల వేతనాలు, సర్వీస్ పరిస్థితులను పరిశీలించి నిర్ణయాలిచ్చేందుకు యిలాంటి త్రైపాక్షిక కమిటీని నియమించారు. ముగ్గురు మూడు రకాల అభిప్రాయాలు వెలిబుచ్చుటతో ఆ రిపోర్టు అమలుజరగకుండా పోయింది.

**వేతనాలను ఉత్పత్తితో ముడిపెట్టే పద్ధతి :**

కార్మికుని ఉత్పాదనశక్తి పెరిగినపుడే జీతాలపెరుగుదల సాధ్యమని ప్రణాళిక చెబుతూంది. గత అనుభవాన్నిబట్టి కార్మికుని పనిభారాన్ని బాగా పెంచి ఆ విధంగా పెరిగిన ఉత్పాదకశక్తినిబట్టి స్వల్పంగా వేతనాలు పెంచే సంకల్పం యిందులో ఉంది. ఇది పెట్టుబడిదారీ దోపిడీయొక్క ప్రత్యేక లక్షణం. కావున కార్మికుని శ్రమశక్తిని దోపిడీచేయుటకు తోడ్పడే పద్ధతే యిది.

**ఉత్పత్తి ఫలితాలనుబట్టి జీతాలు :**

ఈ విధానంకూడా కార్మికునిచేత అధనంగా శ్రమచేయించి అధిక లాభాలు సంపాదించుటకు పెట్టుబడిదారుల కుపయోగిస్తుం దేగాని, కార్మికునికి న్యాయంగా రావలసిన జీతానికి గ్యారంటీ చేయదు. గత అనుభవం కూడా దీనినే రుజువుచేస్తూంది. మొదటి ప్రణాళికా కాలంలో ఉత్పత్తి, ఉత్పాదనశక్తి రెండూ పెరిగినా జీతాలను 25% పెంచాలనే కార్మికోద్యమ కోర్కెను ప్రభుత్వం నిరాకరించింది. ఉత్పత్తి, ఉత్పాదనశక్తుల పెరుగుదలలు పెట్టుబడిదారులలాభాలుపెంచుటకే తోడ్పడ్డాయని పైన చూచాము.

అందువలననే కార్మికోద్యమం యీ విధానాలను అంగీకరించడం లేదు. దాదాపు అన్ని కార్మిక సంస్థలు ఐక్యంగా ప్రభుత్వ జీతాల విధానాన్ని విమర్శిస్తున్నాయి. వెంటనే కార్మికుల వేతనాలు 25 శాతం పెంచాలని కోరుతున్నాయి.

## పారిశ్రామిక సంబంధాలు - వివాద పరిష్కార మార్గాలు

మన దేశంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం, సరియైన పారిశ్రామిక సంబంధాలు నెలకొల్పబడాలంటే కార్మికులకు సంఘం పెట్టుకునే హక్కు, సమిష్టిగా బేరమాడేహక్కు, సమ్మెహక్కు, ప్రభుత్వ జోక్యం లేకుండా ట్రేడ్‌యూనియన్ కార్యకలాపాలు సాగించుకునే స్వేచ్ఛ, ఇతర ప్రజాస్వామిక హక్కులు కాపాడవలసియుంటుందని, కార్మికులకు యీ హక్కులు గ్యారంటీ చేయడంద్వారానే దేశపురోభివృద్ధికవసరమైన ఏ ప్రణాళికయినా జయప్రదమవడానికి కార్మికులు ఉత్సాహంతో పని చేయగలరనీ చెబుతూ వచ్చింది.

## ట్రేడ్‌యూనియన్ హక్కులు :

కాని రెండవ పంచవర్ష ప్రణాళిక యీ హక్కుల సంగతే ఎత్తుకోలేదు. కేవలం, "ప్రాతినిధ్య యూనియన్‌గా గుర్తించబడ్డ సంఘంమాత్రమే యజమానితో చర్చించే అధికారం కల్గియుంటుంది. ఆ సంఘం జీతాలు, అలవెన్సులు, యితర పని పరిస్థితులకు సంబంధించిన విషయాలపై చర్చిస్తుంది" అని మాత్రమే చెప్పింది. ఇది కొత్తదేమీగాదు. బొంబాయి, మధ్యప్రదేశ్, మధ్యభారత్ వగైరా రాష్ట్రాలలో వున్న పారిశ్రామిక సంబంధాల చట్టాలలో యీ సూత్రమే అమలులోఉన్నది. వీటి ప్రకారం మొత్తం కార్మికులలో 15 శాతం సభ్యులుగల కార్మికసంఘం ప్రాతినిధ్య సంఘంగా గుర్తించబడుతుంది. ఈ సూత్రం కంపెనీ యూనియన్‌లను సృష్టించుటకే ఆచరణలో తోడ్పడింది. ఈ విధానానికి వ్యతిరేకంగా అనేకచోట్ల పోరాటాలు కూడా జరిగాయి.

కాబట్టి యీ క్రింది పద్ధతులలో సంఘాలను నడుపుకునే హక్కు యివ్వవలసియుంటుంది, (అ) అన్ని ట్రేడ్‌యూనియన్లనూ గుర్తించాలి. ఒకే పరిశ్రమలో ఒకటికన్నా ఎక్కువ సంఘాలుంటే, రహస్య బాలట్ ద్వారా అన్ని యూనియన్‌లు కలిసి ఎన్నుకున్న కమిటీలను గుర్తించాలి. (ఆ) పై విధంగా గుర్తించబడ్డ కమిటీ యజమానులతో చేసుకునే ఒడంబడికలు కార్మికుల ఆమోదం పొందాలి. (ఇ) ప్రతి సంవత్సరం కార్మికులు స్వేచ్ఛగా తమ యిష్టంవచ్చిన నాయకత్వాన్ని ఎన్నుకునే హక్కుండాలి. యూనియన్ కార్యకలాపాలలో ప్రభుత్వంయొక్క, యజమానియొక్క జోక్యం ఎంతమాత్రమూ ఉండరాదు. ఈ ప్రజాస్వామిక సూత్రాలను గ్యారంటీ చేసిననాడే పారిశ్రామిక సంబంధాలు బాగుపడతాయి.

## వివాదాల పరిష్కారం :

నేటి పారిశ్రామిక వివాదాల చట్టం చాలా లోపభూయిష్టంగా ఉన్నదనీ, దానిని రద్దుచేసి సమగ్రమైన పారిశ్రామిక సంబంధాల చట్టాన్ని తేవాలని కార్మికులు చాలాకాలంగా ఆందోళన చేస్తున్నారు. యూనియన్‌ల గుర్తింపుకూ, సమిష్టి చర్చలద్వారా వివాద పరిష్కార మార్గాలకూ ప్రాముఖ్యత యివ్వాలని కోరుతున్నారు.

కాని ప్రభుత్వం వీటిని ఆలోచించకుండానే పారిశ్రామిక వివాదాల చట్ట సవరణ బిల్లును ప్రవేశపెట్టింది. దానిలో ప్రస్తుతమున్న పారిశ్రామిక ట్రిబ్యునల్స్ యంత్రాంగాన్నలాగే ఉంచింది. నిర్బంధ మధ్యవర్తి పరిష్కారాన్ని మార్చలేదు. వివాదాలను ట్రిబ్యునల్స్‌కు పంపే అధికారం, వాటి అవార్డులను మార్చే అధికారంకూడా ప్రభుత్వం తన చేతిలో పెట్టుకున్నది. పేరుకు అప్పెలేట్ ట్రిబ్యునల్‌ను తొలగించింది. కాని మూడు తరహాల కోర్టులు ఏర్పరచి లిటిగేషన్‌ను అలాగే ఉంచింది. సమ్మె హక్కును మాటల్లో కాదనలేదుగాని ఆచరణలో అసాధ్యం చేసింది. ప్రజోపయోగ పరిశ్రమల పేరుతో సంఘం పెట్టుకునేహక్కును, సమ్మెచేసే హక్కును ప్రశ్నించుతోంది.

## పరిశ్రమ నిర్వహణలో కార్మికుల భాగస్వామ్యం

సోషలిస్టు తరహా సమాజ నిర్మాణంలో కార్మికులు పరిశ్రమల నిర్వహణలో భాగస్వాములుగా చేయబడతారని ప్రకటించబడింది. కార్మికుల ఉత్పాదన శక్తిని పెంచాలన్నా, ఉత్పత్తి క్రమంలోనూ, పరిశ్రమల నిర్వహణంలోనూ కార్మికుల బాధ్యతలను గుర్తింపజేయాలన్నా, యజమానితో సంప్రదించే హక్కు కలిగియున్నాననే సంతృప్తిని కార్మికునికి కలిగించి తద్వారా పరస్పర సహకారం, సత్సంబంధాలు, పారిశ్రామిక శాంతిని నెలకొల్పాలంటేనూ "యజమానుల ప్రతినిధులు, టెక్నీషియన్లు, కార్మికుల ప్రతినిధులతో పరిశ్రమ నిర్వహణా సమితులు ఏర్పరచాలి. ఈ సమితులలో, కార్మికులు సమిష్టిగా బేరమాడి సాధించుకునే విషయాలను చర్చించరాదు" అని ప్లానింగు కమిషన్ చెప్పింది. అలాగే యజమానులు, కార్మికులు ఉభయులూ పరస్పర చర్చలద్వారా అంగీకారానికి రావడానికి "జాయింటు సంప్రదింపుల యంత్రాంగా"న్ని యేర్పాటు చేయాలని, వర్క్సు కమిటీలను పటుతరం చేయాలనికూడా చెప్పబడింది.

దీనిలో యిమిడియున్న భావం స్పష్టంగానే వున్నది. కార్మికుడు యెక్కువ ఉత్పత్తి చేయుటకు తోడ్పడాలి. ఉత్పత్తి అయిన సరుకుమీద అతనికి పెత్తనముండదు. అవి యజమానియొక్క ఆస్థిగానే ఉంటాయి. కాని ఉత్పత్తిని పెంచే పథకాలకు కార్మికుని అంగీకారం పొందడానికి పై సమితులు వినియోగించబడతాయి. అంటే కార్మికులు తమకు తాము

యెక్కువ దోపిడీ చేయబడుటలో భాగస్వాములు కావాలన్నమాట ! పెట్టుబడిదారీ విధానానికి చక్కని ప్రజాస్వామిక ముసుగు !

అంతేగాదు. అశేష కార్మికప్రజల ఆమోదం లేకపోయినా ఒక చిన్న యూనియన్‌కు ప్రాతినిధ్య సంఘపు ముద్రవేసి, యజమానులతో కార్మిక ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఒడంబడికలు చేసుకునేందుకు కూడా యీ యంత్రాంగం చక్కగా తోడ్పడుతుంది. ఉదాహరణకు అహమ్మదాబాద్ మిల్లు యజమానులకూ, టెక్స్‌టైల్ లేబర్ అసోసియేషన్‌కూ; బొంబాయి మిల్లు యజమానుల సంఘానికీ, బొంబాయి రాష్ట్రీయ మిల్లు మజ్దూర్ సంఘానికీ; టాటా కంపెనీకి, శ్రీ జాన్ నాయకత్వాన వున్న టాటా వర్కర్స్ యూనియన్‌కీ మధ్య జరిగిన ఒప్పందాలు యిందుకు మచ్చుతునకలు.

## సాంఘిక భద్రత-కార్మిక సంక్షేమ పథకాలు

మన దేశంలో కార్మికులకు గృహవసతి, ముసలితనంలో సౌకర్యాలు, నిరుద్యోగభృతి, స్త్రీలకు ప్రసూతిసౌకర్యాలు వగైరా సాంఘిక భద్రతలు సక్రమంగా లేవు. అనేక సంవత్సరాల ఆందోళన ఫలితంగా నేటికి కొన్ని శాసనాలు చేయబడ్డాయి.

1. ప్రావిడెంటుఫండు చట్టం :

ఈ చట్టం ప్రకారం కార్మికుని జీతంనుండి రూపాయికి అణా వంతున మినహాయించి, దానికి యజమాని తరఫున అణా కలిపి నిలవచేసి, సర్వీస్ అనంతరం ఆ మొత్తం కార్మికునికి యివ్వబడుతుంది. ఈ చట్టం నేడు దేశంలో 2200 ఫ్యాక్టరీలలో వున్న 16 లక్షలమందికి వర్తిస్తోంది. రెండవ ప్రణాళిక ఆఖరుకు మరొక 1400 ఫ్యాక్టరీలలో 4 లక్షలమందికి వర్తింపజేస్తారు.

అయితే యీ చట్టం ప్రకారం 20 సంవత్సరముల సర్వీసు వుంటేనే యజమాను లివ్వవలసిన పూర్తివాటా యివ్వబడుతుంది. ఆలోచన 5 నుండి 10 సంవత్సరముల సర్వీసు గలవారికి యజమాని యిచ్చే ధనంలో సగం వాటా, 10-15 సంవత్సరముల మధ్య సర్వీసుకు 60 శాతం, 16-19 సంవత్సరముల సర్వీసుకు 75 శాతం మాత్రమే లభిస్తుంది. కాబట్టి చివరకు యజమానులనుండి లభించే వాటా స్వల్పం మాత్రమేనని తేలుతుంది. రాష్ట్రీ

ప్రభుత్వాల పరిశ్రమలలోని కార్మికులకు చాలామందికి యీ సౌకర్యం కూడా అమలు జరుగుటలేదు.

ఇదేవిధంగా అనేక సంవత్సరాల పోరాటం ఫలితంగా గ్రాట్యుయిటీ పద్ధతి సాధించబడింది. కాని దీన్ని అమలుజరపడంలో యజమానుల దయాదాక్షిణ్యాలపైననే ఆధారపడవలసి వస్తూంది.

ఎంప్లాయీస్ స్టేట్ యిన్స్యూరెన్సు స్కీము :

ఈస్కీము ప్రకారం కార్మికులు తమ స్వల్ప వేతనాలనుండి కొంత మొత్తాన్ని చెల్లించవలసి యున్నది. రు. 1 నుండి రు. 1-8-0 వరకు రోజు కూలీలు నెలకు 0-8-0 చొప్పున, రు. 1-8-0 నుండి రు. 2-0-0 సంపాదించే వారు నెలకు రు. 1-0-0 చొప్పున చెల్లించాలి. ఈ మొత్తాలకు యజమానులు రు. 1-12-0 నుండి రు. 2-0-0 వరకు కలుపుతారు. ఈవిధంగా ఏర్పడిన నిధినుండి కార్మికులకు సిక్ నెస్ బెనిఫిట్, డిజేబుల్ మెంటు బెనిఫిట్, డిపెండెంట్స్ బెనిఫిట్, స్త్రీలకు మెటర్నిటీ బెనిఫిట్, వైద్యసౌకర్యం వగైరా కలుగజేస్తారు. దీనిక్రింద ప్రస్తుతం దేశంలో 30 కేంద్రాలలో 10½ లక్షల కార్మికులు సౌకర్యాలు పొందుతున్నారు.

ఈ స్కీములో వైద్యసౌకర్యం కార్మికుల కుటుంబాలకు కూడా వర్తించాలని నిర్దేశించినా అది అమలు జరపడంలేదు. నిధులలో అత్యధిక భాగం కార్పొరేషన్ పరిపాలనా యంత్రానికే ఖర్చవుతుంది. కార్మికుల సౌకర్యాలకు స్వల్పమొత్తం మాత్రమే వినియోగించబడుతూంది. అదే గాక దీనిలో అనేక అవకతవక లుండుటవలన కార్మికులకు తీవ్ర అసంతృప్తిని కలిగిస్తూంది.

కార్మిక సంక్షేమ పథకాలు :

కొన్ని పరిశ్రమలలో (బొగ్గు, మైకా వగైరాలలో) కార్మిక సంక్షేమ పథకాలక్రింద కొంత మొత్తం కేటాయించబడుతూంది. దానిలోనుండి కార్మికులకు విద్య, వైద్య, గృహవసతి, వినోదం మొదలైన సంక్షేమ కార్యక్రమాలు అమలు జరపాలని ఉద్దేశం. ఈ స్కీముద్వారా కొద్దిమందికి తాత్కాలికంగా స్వల్ప సహాయం లభిస్తోంది. కాని వీటికి కేటాయించిన ధనంలో కొంతదుర్వినియోగం జరుగుతూంది. దాని నరికట్టవలసియుంటుంది.

గృహ వసతులు :

మొదటి ప్రణాళికలో కొద్ది మొత్తం వీటినిమిత్తం ప్రత్యేకించబడింది. రెండవ ప్రణాళికలో రు. 45 కోట్లు కేటాయించబడింది. ఇదిగాక మురికి పేటలను బాగుచేయుటకు, మునిసిపల్ కార్మికుల గృహవసతికి మరొక రు. 20 కోట్లు కేటాయించబడింది.

కాని యీ సౌకర్యాన్ని వినియోగించుటలో చాలా జాప్యం జరుగు తూంది. 1955 సెప్టెంబర్ నాటికి 71,887 యిళ్లు కట్టుటకు రాష్ట్ర ప్రభుత్వాలకు రు. 20.5 కోట్లు శాంక్షన్ చేస్తే, 26,204 గృహాలు మాత్రమే తయారయ్యాయి. ప్రభుత్వం కట్టించే ఇళ్ళ అద్దెలు ఎక్కువగా ఉంటు న్నాయి. కో-ఆపరేటివ్ పథకంలో ప్రారంభంలోనే కార్మికులు ఎక్కువ పెట్టుబడి పెట్టవలసి యుండుటవలన గృహనిర్మాణం చురుకుగా సాగుట లేదు. కావున యీ పని చురుకుగా జరగాలంటే ప్రతి పెద్ద పారిశ్రామిక యజమానిని అతని లాభాలలో కొంతభాగం గృహ నిర్మాణానికి కేటా యించేలాచేసి, తద్వారా గృహవసతి కలుగజేయాలి. ప్రభుత్వ పరిశ్రమల లోనూ, స్థానిక సంస్థలలోనూ గృహ వసతికల్పించే యేర్పాట్లు ప్రభుత్వమే చేయవలసియుంటుంది.

కార్మికవర్గ ఐక్యత :

ప్రభుత్వం అవలంబిస్తున్న కార్మిక వ్యతిరేక విధానాలను అరికట్టా లన్నా, అనేక సంవత్సరాలుగా పోరాడి సాధించుకున్న చట్టాలలోని మంచి హక్కులను అమలు జరిపించుకోవాలన్నా, ప్రజాస్వామిక, ట్రేడ్ యూనియన్ హక్కులను కాపాడుకోవాలన్నా అభేద్యమైన కార్మికవర్గ ఐక్యత అవసరం. ఈనాడు దేశంలోనున్న కేంద్ర ట్రేడ్‌యూనియన్ సంస్థల మధ్య ఐక్యతను సాధించాలి. ఇది జరగాలంటే క్రిందినుండి కార్మికవర్గం యొక్క ఐక్యతను నిర్మించాలి. ఈపాటికే అనేక సమస్యల పైన కార్మికులు ఐక్యపోరాటాలు జరుపుతున్నారు. దీని నింకా దృఢతరం చేసి ముందుకు తీసుకుపోవలసి యున్నది.

## పెట్టుబడి సేకరణ - వనరులు

మన దేశంలో పెట్టుబడి సేకరణ పద్ధతులను పరిశీలించేముందు

చైనాలో యీ సమస్య నెలా పరిష్కరిస్తున్నారో తెలుసుకోవడ మవసరం.

చైనా మొదటి పంచవర్ష ప్రణాళికా ఖర్చుల కవసరమైన పెట్టుబడి వనరులను గురించి మాట్లాడుతూ లై-ఫూ-షున్ యీ క్రింది విధంగా వనరులు లభించగలవని చెప్పారు :

(1) సామ్రాజ్యవాదుల దోపిడి పూర్తిగా అంతరించుటవలన దేశీయ సంపద చాలా లభ్యమవుతూంది. (2) వ్యవసాయ, భూసాస్వామ్య విధానాల రద్దు ద్వారా రైతుల ఆదాయం బాగా పెరిగింది. దానిలో కొంతభాగం దేశ పునర్నిర్మాణానికి లభిస్తుంది. (3) నిరంకుశ పెట్టుబడి నిర్మూలించబడి పరిశ్రమలు ప్రజల ఆస్తిగా మారుటవలన ఒక పెద్ద వనరు దొరికింది. (4) ప్రయివేట్ పెట్టుబడిదారుల పరిశ్రమలలోని లాభాలపై చట్టరీత్యా కంట్రోల్ విధించుట, మిగిలిన లాభాలలోనుండి కూడా కొంతశాతం ఆదాయపు పన్ను ద్వారా ప్రభుత్వానికి లభించుట, కొంతశాతం ప్రయివేట్ పరిశ్రమల అభివృద్ధికి వినియోగించుటద్వారా కొంత వనరుల సమస్య పరిష్కారమవుతూ ఉంది. (5) శ్రామికుల ఉత్పత్తిశక్తి పెరిగి ఖర్చులు తగ్గుతూ వుండడంవలనా, విస్తృతంగా పొదుపు ఉద్యమం కొనసాగుట వలనా కొన్ని నిధులు మిగులుతాయి.

భారత ప్రభుత్వం వీటిలో యే ఒక్క పద్ధతినీ సక్రమంగా అసలు జరుపలేదు. పాత పునాదుల నలాగే వుంచింది. మన ప్రభుత్వం ప్రధానంగా సాధారణ ప్రజలపై పన్నులభారాన్ని వేయుటద్వారానే డబ్బును సేకరిస్తుంది. ఉదాహరణకు మొదటి ప్రణాళికా కాలంలో ఖర్చుపెట్టిన 2 వేల 120 కోట్ల రూపాయలలో 2 వేల 30 కోట్ల రూపాయలను యీ క్రింది విధంగా సేకరించింది :

| | | | |
|---|---|---|---|
| బడ్జెట్ వనరులనుండి | రు. | 11,18 | కోట్లు |
| సాలుసరి ఆదాయాలనుండి | రు. | 490 | ,, |
| పైనుండి సహాయం | రు. | 230 | ,, |
| ప్రభుత్వ ఋణాలద్వారా | రు. | 202 | ,, |

బడ్జెట్ వనరులనుండి డబ్బు తీయడం అంటే అర్థం ప్రజలపైన పన్నులభారాన్ని పెంచడమే. ఉదాహరణకు 1948-'49 లో కేంద్ర ఎక్సైజు

సుంకం 65 కోట్లు వసూలుచేస్తే 1955-'56 లో 140 కోట్లు, 1956-'57 లో 170.45 కోట్లు వసూలు చేయబడింది. అలాగే అమ్మకపుపన్ను 1948-'49 లో రు. 32.42 కోట్లు ఉంటే, 1955-'56 లో రు. 68.31 కోట్లు, 1956-'57 లో 70.69 కోట్లకు పెరిగింది. అదేవిధంగా భూమిశిస్తు 1951-'52 లో రు. 47.99 కోట్లనుండి 1954-'55 నాటికి రు. 71.78 కోట్లకు పెంచబడింది. ఈ విధంగా ఒకవైపున సాధారణ ప్రజలపైన భారం పెంచుతూ రెండవవైపున ప్రత్యక్షపు పన్నులను (అంటే పెట్టుబడిదారులపై పన్నులను) ప్రభుత్వం పెంచనేలేదు. 1950-'51 లో ప్రత్యక్షపు పన్నులనుండి వస్తున్న మొత్తం ఆదాయం రు. 173. 22 కోట్లు అయితే, 1955-'56 లో కూడా ఇవి రు. 173.79 కోట్లు మాత్రమే. మొత్తం పన్నులలో వీటి శాతం 42.8 నుండి 36.1 తగ్గిపోయింది.

ఇక రెండో ప్రణాళికకు ప్రభుత్వరంగంలో ఖర్చుపెట్టవలచిన రు. 4800 కోట్లు యీ క్రింది విధంగా సంపాదించాలని సంకల్పించబడింది:

| | |
|---|---|
| **ప్రస్తుత ఆదాయాలనుంచి మిగులు :** | |
| 1. 1956-'57 పన్నులనుంచి | రు. 350 కోట్లు |
| 2. అదనపు పన్నులు | 450 ,, |
| **ప్రజలనుంచి ఋణాలు :** | |
| 3. ప్రభుత్వం సేకరించే అప్పు | 700 ,, |
| 4. చిన్న మొత్తాల పొదుపు | 500 ,, |
| **బడ్జెట్ లోని యితర ఆదాయాలు :** | |
| 5. రైల్వేలనుంచి | 150 ,, |
| 6. ప్రావిడెంట్ ఫండ్ వగైరా డిపాజిట్ల బాపతు | 250 ,, |
| 7. విదేశాలనుండి అప్పు | 800 ,, |
| 8. ఋణగ్రస్త ద్రవ్యం | 1200 ,, |
| 9. లోటు | 400 ,, |
| మొత్తం | రు. 48,00 కోట్లు |

దీనినిబట్టి అదనంగా రు. 800 కోట్లవరకు పన్నులు వేయడానికి మన ప్రభుత్వం తలపెడుతూ వుంది. అలాగే ఋణగ్రస్త ద్రవ్యవిధానం ద్వారా రు. 1200 కోట్లు సేకరించదలచింది. ఇది ప్రజలపైన పరోక్షపు పన్ను తప్ప మరేమీ కాదు. ఇది హద్దుమీరినట్లయితే నోట్ల ముమ్మరము,

ధరలు పెరిగి ప్రజల జీవనస్థాయి పడిపోతుంది. పోతే విదేశాలనుండి ముఖ్యంగా పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలనుండి అప్పు తేవడం ప్రమాద భరితమే కాగలదు.

వనరు లెక్కడున్నాయి?

అయితే యిది గాక ప్రత్యామ్నాయ వనరు లెచ్చటినున్నా యనే సమస్య ఉన్నది. ఈక్రింది పద్ధతుల నవలంబించినట్లయితే ప్రజలపైన పన్నుల భారాన్ని పెంచకుండానే చాలినంత పెట్టుబడి సేకరించుటకు అవకాశ ముంటుంది: (1) ఎక్కువ ఆదాయాలపై పన్ను విధించాలి. (2) సంవత్స రానికి కాల్డార్ అంచనా ప్రకారం రు. 200-300 కోట్ల మధ్యనున్న ఆదా యపు పన్ను ఎగవేతను ఖచ్చితంగా అరికట్టాలి. (3) రాజులకు, భూస్వాము లకు, కోటీశ్వరులకు రాజభరణాలు, విశేష ప్రతిఫలాలు యివ్వడం మాని వేసి వారి స్వంత ఆస్తులమీద లెవీలు వసూలుచేయాలి. (4) ప్రభుత్వ నిర్వాహణ కార్యా ఖర్చులు తగ్గించి పొదుపుచేయాలి. అలాగే పెట్టుబడి దారులు దుర్వ్యయము, దురుపయోగము చేయకుండా ఆపాలి. (5) పెట్టు బడిదారుల లాభాలకు పరిమితులు పెట్టాలి. డివిడెండ్లకు గరిష్టపరిమితి విధించి ఆపైన వచ్చే మొత్తాన్ని నిర్బంధరుణంగా సేకరించాలి. విదేశీకంపె నీలు మన దేశంనుంచి తరలించుకుపోయే ధనాన్ని తగ్గించి, ఆవిధంగా మిగిలిన ధనాన్ని ప్రభుత్వం సేకరించాలి. (6) ప్రభుత్వ రంగాన్ని విస్తరింపజేసి, తద్వారా ఆదాయాన్ని పెంచుకోవాలి. (7) వాణిజ్యాన్ని, వ్యాపారాన్నికూడా, ముఖ్యంగా విదేశీ వ్యాపారాన్ని ప్రభుత్వం తన చేతులలోనికి తీసుకొని, దానినుండి వచ్చే లాభాన్ని ప్రణాళికకు వినియో గించాలి.

## ఆర్థిక వనరుల కొరత - ప్రణాళికా సంక్షోభం

ఈనాడు మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తీవ్ర సంక్షోభానికి గురి అయిందని అందరూ అంగీకరిస్తున్న విషయమే. మన స్వతంత్ర ఆర్థికాభి వృద్ధి ఆశయానికే ముప్పు సంభవించేటట్లుంది. కాబట్టి యీ సంక్షోభంలో నుండి సత్వరమే బయటపడాలి. దానిని పరిష్కరించేందుకు మార్గాలను పరిశీలించవలసి యున్నది.

**సంక్షోభ స్వరూపం :**

ప్రస్తుతం యీ సంక్షోభం మన ప్రణాళికా నిర్వహణ కవసరమైన పెట్టుబడి వనరుల కొరతవలన (inadequacy of resources) ఏర్పడింది. ధరల పెరుగుదల, మన ఎగుమతి-దిగుమతి వ్యాపారంలో లోటువలన ఈ కొరత మరింత ఎక్కువయింది.

మన దేశంలోనూ, ప్రపంచ మార్కెట్ లోనూ కూడా ధరలు యీ మధ్యకాలంలో పెరిగాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక మొదటి భాగంలో కన్న ఆఖరు భాగంలో ఖర్చు హెచ్చింపు పెట్టబడింది. ఇదే కాలంలో కరెన్సీకూడాఎక్కువఅచ్చువేయబడింది. ఫలితంగా 1953–'54 లోపబ్లిక్ లో డబ్బు సప్లయి అవనంగా రు. 29 కోట్లు, 1954 – '55 లో రు. 127 కోట్లు, 1955 – '56 లో రు. 264 కోట్లు ఎక్కువయింది. 1955 – '56 లో షెడ్యూల్డు బాంకులు యిచ్చిన అప్పులుకూడా గతంలోకంటె 22 శాతం పెరిగాయి. ఇలా ఒకవైపున డబ్బు చలామణి ఎక్కువవుతూంటే రెండోవైపున ప్రభుత్వం ధరల నరికట్టేందుకు ఏ్విచర్యలు తీసుకోలేదు. దానితో మన దేశంలో ధరలసూచీ 1955 మేలో 89 నుండి 1956 మార్చి నాటికి 98 కి, 1956 డిసెంబరు నాటికి 108 కి, 1957 ఆగస్టు నాటికి 112 కు పెరిగింది.

ఇదే దశలో ప్రపంచ మార్కెట్ లోకూడా 1955 నుండీ ధరలు క్రమంగా పెరుగుతూ వచ్చాయి. సూయజ్ సంక్షోభం దీనికి మరింత దోహదమిచ్చింది. ఈ రెండు కారణాల ఫలితంగా మన ప్రణాళికలో పబ్లిక్ రంగంలో ఖర్చుపెట్టదలచుకున్న రు. 4800 కోట్లు యీనాటి ధరల ప్రకారం రు. 5500 కోట్లవుతుందని అంచనా వేయబడింది.

మన ఎగుమతి – దిగుమతి వ్యాపారంలో లోటు క్రమంగా ఎక్కువవుతూంది. 1956 ఏప్రిల్ నుండీ 1957 సెప్టెంబర్ లోపల యీ లోటు రు. 591 కోట్లున్నది. 1957 అక్టోబర్ నుండి 1958 మార్చి ఆఖరుకు మరొక రు. 230 కోట్ల లోటు ఏర్పడింది. ఈ రేటున రెండవ ప్రంచవర్ష ప్రణాళికా కాలంలో మన విదేశీ వ్యాపారం లోటు మొదటి అంచనాల ప్రకారం రు. 1100 కోట్లు గాక రు. 1700 కోట్లవుతుందని అంచనా వేయబడింది. ఈ వ్యాపారంలోటును చెల్లించుకునేటందుకు అనుకున్న దానికన్న ఎక్కువగా మన విదేశీ మారకపు ద్రవ్యనిధులను ఖర్చుపెట్టవలసి

వస్తూంది. దానితో త్వరితగతిని మన విదేశీ ద్రవ్యనిధులు తరిగిపోయి సంక్షోభం ఏర్పడింది. ఉదాహరణకు 1956 లో రు. 683.46 కోట్లు దాకా ఉన్న మన విదేశీ మారకపు ద్రవ్యనిధి 1958 మే నాటికి రు. 395.93 కోట్లకు తగ్గిపోయింది. (రిజర్వుబ్యాంకు బులెటిన్ - 1958 జూన్)

పైన చెప్పిన కారణాల ఫలితంగా ఏర్పడిన సంక్షోభాన్ని తట్టుకు నేందుకు ప్లానింగ్ కమిషన్ రెండవ ప్రణాళికలో పబ్లిక్ రంగంలో ఖర్చు పెట్టదలచిన దాంట్లో రు. 300 కోట్లు మేరకు కోతపెట్టదలచుకున్నది. పబ్లిక్ రంగంలో ముఖ్యమైన కీలక పరిశ్రమలలో కొన్నింటిని పూర్తిగా ఎత్తి వేయుటకు, కొన్నిటి నిర్మాణాన్ని మూడవ ప్రణాళికాకాలం నాటికి వాయిదా వేయుటకు సంకల్పించబడింది.

ఈ క్రింది వాటిని పూర్తిగా ఎత్తివేయదలచుకున్నట్లు ప్రకటించ బడింది. లిగ్నైట్ ప్రాజెక్టులో కార్బనైజ్డ్ బ్రిక్కెట్లు ఉత్పత్తి, సెక్యూరిటీ పేపర్ మిల్లు, నౌకలడీజెల్ యింజన్ ప్రాజెక్టు, డ్రైడాక్ నిర్మాణం, బగాసీ న్యూస్ ప్రింటు, కృత్రిమ రబ్బర్, స్ట్రక్చరల్ ప్లేట్ అండ్ వెసల్ షాపు, భారీ యంత్రభాగాల ఉత్పత్తి, టంగ్స్టన్ కార్బైడ్ ఉత్పత్తి, సేలమ్ అల్యూమినియం ఫ్యాక్టరీ, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్మించే ప్రాజెక్టులు, అలాగే ప్రయివేట్ రంగంలో కొన్ని పథకాలు.

ఈ క్రింది వాటిని మూడవ ప్రణాళిక నాటికి వాయిదా వేయాలని ప్రకటించబడింది. ఫౌండ్రీ ఫోర్జ్ ప్రాజెక్టు, భారీయంత్ర నిర్మాణప్రాజెక్టు, గనుల యంత్ర నిర్మాణ ప్రాజెక్టు, మైసూరులోని భద్రావతి యినుము ఉక్కు పరిశ్రమ విస్తరణ, నెవెల్లీ ఎరువుల ఫ్యాక్టరీ, థర్మల్ పవర్ ప్లాంటు, రూర్కెలా ఎరువుల ఫ్యాక్టరీ, కళ్ళద్దాల ఫ్యాక్టరీ, భారీ విద్యుద్యంత్ర కర్మాగారం, ముడిఫిల్మ్ ప్రాజెక్టు, రంగులు, మందుల పరిశ్రమ విస్తరణ, అస్సాం నూనె శుద్ధి కర్మాగారం, ఎల్లాయ్ అండ్ టూల్ ఉక్కు కర్మాగారం.
(From Appraisal & Prospects of the Second Five Year Plan)

ఈ ఆర్థిక వనరుల కొరతను పరిష్కరించేందుకు రెండు మార్గాలు సూచించబడుతున్నాయి. ఒకటి అభివృద్ధి నిరోధకుల మార్గం, రెండవది ప్రజాతంత్రవాదుల మార్గం.

ప్రణాళికలోని అభ్యుదయకర అంశాలను మొదటినుండీ వ్యతిరేకిస్తూ వచ్చిన మితవాద అభివృద్ధి నిరోధకులు ప్రస్తుత సంక్షోభాన్ని అవకా

శంగా తీసుకుని, దీనిని పరిష్కరించేందుకు దేశ ప్రయోజనాలకు, ప్రజా శ్రేయస్సుకు, ప్రణాళిక ఆశయాలకు విరుద్ధమైన సూచనలు చేస్తున్నారు. వారి సూచనలు యిలా ఉన్నాయి: మన ఆర్థిక వనరులను దృష్టిలోనికి తీసుకున్నపుడు ప్రణాళికా లక్ష్యాలు, ముఖ్యంగా ప్రభుత్వ రంగంలోని లక్ష్యాలు అత్యాశాపూరితంగా ఉన్నాయి. అందువలన ప్రభుత్వరంగాన్ని తగ్గించాలి. ప్రభుత్వరంగంలో భారీపరిశ్రమలకు, ఖనిజాల అభివృద్ధికి, సాంఘిక సౌకర్యాలకు మిగిలినవాటికన్న ఎక్కువ ప్రాముఖ్యత యివ్వడం పొరపాటుగాన వాటిలో కోతపెట్టాలి. ఈవిధంగా కత్తిరించిన తరువాతకూడా ప్రణాళికను అమలుజరిపేందుకు చాలినన్ని దేశీయ ఆర్థికవనరులు లభ్యంగావు గాన విదేశాల సహాయాన్ని, ముఖ్యంగా అమెరికన్, బ్రిటన్ వగైరా పశ్చిమరాజ్యాల సహాయాన్ని, వారు కోరిన షరతులకు అంగీకరించియైనా సరే అర్థించాలి. దేశీయవనరులను పెంచుకునేందుకు ప్రజల వాడకాన్ని తగ్గించడం తప్ప మార్గంలేదు. గాన ప్రజలపైన పన్నులభారాన్ని పెంచవలసి వుంటుంది. ఇవీ క్లుప్తంలో అభివృద్ధినిరోధకుల సూచనలు.

పై సూచనలన్నీ మన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బలహీనపరచేవిగానూ, ప్రజల జీవనస్థాయిని పెంపొందించుకునే ఆశయానికి విరుద్ధమైనవిగానూ ఉన్నాయనేది స్పష్టంగా అర్థమవుతూనే ఉన్నది.

అయితే ప్రణాళికలో ప్రకటించబడిన ఆశయాలను అమలుజరుపుతూ యీసంక్షోభంలో నుండి బయటపడేటందుకు తోడ్పడే ప్రత్యామ్నాయ సూచనలేమైనా వున్నాయా? ప్రజాతంత్ర శక్తులు యీ క్రింది విధంగా దేశీయ ఆర్థిక వనరులను పెంపొందించుకోవచ్చునని సూచిస్తున్నాయి:

ఒకటి: చట్టా వ్యాపారస్తులు విపరీతంగా నిల్వచేసిన వెండి, బంగారాలను ప్రభుత్వం స్వాధీనపరచుకుని ప్రణాళికా ఖర్చులకు వినియోగించవచ్చును. ప్రస్తుత ధరలలో వీటి విలువ దాదాపు రు. 1000 కోట్లువరకు వుంటుందని అంచనా.

రెండు: షెడ్యూల్డు బాంకులను జాతీయంచేసి వీటి నిధులను ప్రణాళికా బద్ధమైన దేశాభివృద్ధికి, ప్రభుత్వ, ప్రయివేట్ రంగాల ఖర్చులకు వినియోగించవచ్చును.

మూడు : మన విదేశీమారకపు ద్రవ్యనిధులలో గణనీయమైనభాగం కీలకయంత్రాలకు గాక, విలాసవస్తువుల దిగుమతికి, వాడకం వస్తువులకు వినియోగించబడుతూంది. ఉదా : 1956-'57 లో మన ప్రణాళికలో అనుమతించిన దానికంటే మించి రు. 24 కోట్ల విలువగల విద్యుత్ పరికరాలు, చెమ్చాలూ, చాకులూ, చిన్న చిన్న లోహసామగ్రి వగైరాల దిగుమతికి వినియోగించారు. అలాగే పళ్లు, కూరగాయలు మొదలగువాటి దిగుమతికి మరొక రు. 20 కోట్ల విదేశీ ద్రవ్యమారకం హరించుకుపోయింది. ప్రణాళికలో అవకాశం యివ్వబడని యంత్రసామగ్రిని తెప్పించేందుకు ప్రయివేట్ రంగంలో మరికొంత విదేశీ మారకపు ద్రవ్యం ఖర్చయింది. ఇలాంటి అనవసర దిగుమతులను పూర్తిగా అరికట్టేందుకు చర్యలు తీసుకోవలసి యుంటుంది. నాలుగు : విదేశీ మారకద్రవ్యపు కొరత యేర్పడినపుడు, ద్వితీయ ప్రణాళికలోని కొన్ని ముఖ్య లక్ష్యాలనైనా (మహా అయితే వీటికి రు. 200 కోట్లు అవసరమవుతాయి) సోషలిస్టు దేశాల సహాయంతో పూర్తిచేయుటకు ఎంతవరకు అవకాశాలున్నాయో పరిశీలించాలి. సోషలిస్టు దేశాల సహాయం విషయంలో విదేశీ మారకపుద్రవ్యం యొక్క అవసరమేమీ ఉండదుగాన యిబ్బందేమీ ఉండదు.

ఈ తక్షణ చర్యలతోపాటు దేశీయ వనరుల నభివృద్ధి చేసేందుకు యింతకు పూర్వమే "వనరు లెక్కడున్నాయి?" అనే శీర్షికక్రింద యివ్వబడిన సూచనలను కూడా ప్రభుత్వం అమలు జరుపబూనుకుంటే సంక్షోభాన్ని పరిష్కరించుకోగలము.

కాని ప్రభుత్వం, ప్రజాతంత్ర వాదులు చేస్తున్న యీ సూచనలను తిరస్కరిస్తూంది. సోషలిస్టు దేశాలనుండి సహాయం తీసుకోగల అవకాశాల సంగతే ఎత్తడంలేదు. అంతేగాదు. సోషలిస్టుదేశాలు ఎట్టి షరతులులేకుండా ఏదైనా సహాయం చేస్తామని ప్రకటించినా ప్రభుత్వం వాటిని గురించి ఆలోచించడమేలేదు. అదేవిధంగా దేశీయ వనరుల సేకరణ విషయంలో కూడా పై సూచనలను ప్రభుత్వం అసలు జరుప నిరాకరిస్తూంది. దీనికి మన దేశంలోను, కేంద్ర ప్రభుత్వంలోను గల కొన్ని అభివృద్ధినిరోధక వర్గాల ఒత్తిడికి ప్రభుత్వం లొంగడమే ప్రధాన కారణం.

స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి తోడ్పడే యీ మార్గాన్ని వదలిపెట్టి ప్రభుత్వం అభివృద్ధి నిరోధకుల ఒత్తిడికి లొంగి సంక్షోభపరిష్కారానికి,

ఎవరైతే మన దేశ ఆర్థికాభివృద్ధిని కంటగించుకుంటూ వచ్చారో, ఎవరైతే మన దేశ స్వతంత్ర ఆర్థిక పురోభివృద్ధికి అడ్డుగా నిలబడ్డారో వారివైపే అర్రులు చాచుతోంది. పాశ్చాత్య పెట్టుబడిదారులను అప్పు అడిగేందుకు శ్రీ మొరార్జీ దేశాయిని భిక్షాపాత్ర యిచ్చి పంపించింది.

## పాశ్చాత్య రాజ్యాల అప్పులు - వాటివల్ల ప్రమాదం

శ్రీ మొరార్జీ దేశాయి అమెరికాలో జరిపిన రాయబారాల ఫలితంగా అమెరికా, బ్రిటన్, కెనడా, పశ్చిమ జర్మనీ, జపాన్ దేశాలు ప్రపంచ బ్యాంకు కలిసి మొత్తం 560 కోట్ల రూపాయలు మనకు అప్పు యివ్వడానికి అంగీకరించినట్లు వార్తలు వచ్చాయి. జపాన్ పరోక్ష 4 కోట్ల 76 లక్షలు అప్పు యివ్వడానికి సిద్ధంగా వున్నదని జపాన్ ఆర్థిక మంత్రి యిటీవల కలకత్తాలో ప్రకటించారు. మొన్న మొన్నటివరకు అనేక షరతులుపెట్టి ఆ షరతుల కన్నింటికి అంగీకరించడం లేదనే కారణంతో సహాయంచేయ నిరాకరిస్తూవచ్చిన యీ దేశాలు, యీ వేళ యింత విరివిగా సహాయం చేసేందుకు పూనుకున్నాయంటే తెరవెనుక యేదో జరిగిందని అనుమానం రాకపోదు.

ఏ షరతులకు లోబడి ఈ రుణాలను ప్రపంచబ్యాంకు, ఇతర పెట్టుబడిదారీ దేశాలు యిస్తున్నాయో మాత్రం ప్రభుత్వం ప్రకటించలేదు. అయినా పత్రికలలో వచ్చినవార్తలు, యీమధ్యనే ఢిల్లీలో జరిగిన ప్రపంచ బాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి, అంతర్జాతీయ పెట్టుబడి కార్పొరేషన్ సమావేశాలలో యీ దేశాల ప్రతినిధులు వెలిబుచ్చిన అభిప్రాయాలనుబట్టి వారు కోరిన షరతులకు అంగీకరించినట్లుగానే తెలుస్తూంది.

## వారు కోరుతున్న షరతులు

వారు కోరుతున్న షరతు లేమిటో గత అనుభవమే రుజువు చేస్తూంది. గతసంవత్సరం జూన్ మాసంలో మన దేశంలో సంచరించిన ప్రపంచబాంకు ప్రతినిధివర్గం రిపోర్టును పరిశీలిస్తే వారు కోరుతున్న దేమిటో తేలుతుంది. ఆ ప్రతినిధివర్గం మన పబ్లిక్‌రంగం లోని ముఖ్యమైన ప్రాజెక్టులను కొన్నింటిని వదలుకున్న పిమ్మటనే సహాయం చేస్తామని చెప్పింది. భారత ప్రభుత్వం ఉక్కు పరిశ్రమలు

సోవియట్ సహాయంతో పూర్తిచేయవలసినవి తప్ప మిగిలినవాటిని, ముఖ్యంగా యంత్రనిర్మాణ పరిశ్రమను వదలివేయుట కంగీకరించింది. అలా చేసిన పిమ్మటనే ప్రపంచబ్యాంకు అప్పు యిచ్చేందుకు సిద్ధపడింది.

అదేవిధంగా యీ ప్రతినిధివర్గం తన రిపోర్టులో భారతదేశంయొక్క, ప్రభుత్వంయొక్క అంతర్గత విధానాలను విమర్శించ సాహసించింది. అస్సాం, బీహార్‌లలో నెలకొల్పవలచుకొన్న నూనెశుద్ధి కర్మాగారాల స్థాపన వెనుక రాజకీయ ఉద్దేశాలున్నాయని విమర్శిస్తూ వాటిని ప్రయివేట్ కంపెనీల కప్పచెప్పకుండా పబ్లిక్ రంగంలో నెలకొల్పుతానన్నందుకు కినుక వహించింది. వాటిని అమెరికన్ గుత్త యజమానుల కప్పజెప్పాలని ప్రపంచ బ్యాంకుయొక్క కోరిక.

తిరిగి 1958 జూన్‌లో ప్రపంచ బాంకు ప్రతినిధివర్గం తన రిపోర్టులో భారతదేశం యీనాటి విదేశీ ద్రవ్యమారకపు యిబ్బందులను తగ్గించుకునేందుకు, రెండో ప్రణాళికలో పబ్లిక్ రంగంలో స్థాపించవలచుకున్న కొన్ని ముఖ్య ప్రాజెక్టుల నిర్మాణాన్ని వదలివేసుకోవాలని సూచించింది. దీనితో సంతృప్తి పడక మూడో ప్రణాళికలోకూడ, రెండో ప్రణాళికలో మిగిలిపోయినవాటిని పూర్తిచేసుకోవాలే తప్ప, క్రొత్త వాటిని నిర్మించుటకు పథకాలు వేయకూడదని శాసించింది. రిపోర్టులో మరొక భాగంలో తన అసలు రంగును బయటపెడుతూ యిలా వ్రాసింది: "భారత దేశం ఉక్కు, యింజనీరింగ్ వస్తువులను యెగుమతిచేసే దశకు చేరుకోవాలంటే చాలాకాలం పడుతుంది. ఈమధ్యలో తన దిగుమతులకు డబ్బు చెల్లించడమెలాగ? కాబట్టి భారతదేశం తన దేశంలో అవసరాలనైనా తగ్గించుకుని విదేశాలకు వ్యవసాయ సరుకులను, ముడిసరుకులను, సాంప్రదాయికంగా ఉత్పత్తిచేస్తున్న పారిశ్రామిక వస్తువులను (అంటే జనపనార సంచులు వగైరా) యెగుమతి చేయవలసియుంటుంది." దీనినిబట్టి మన పారిశ్రామికాభివృద్ధి వీరికి ససేమిరా యిష్టంలేదని తేలుతుంది. వారు యింతటితో ఆగలేదు. కార్మికులకు సౌకర్యాలు యివ్వగూడదని, కుటీర పరిశ్రమలకు సహాయం చేయగూడదని అలా చేస్తే పారిశ్రామికోత్పత్తి ఖర్చులు ఎక్కువై విదేశాలలో పోటీకి నిలవలేక నష్టపోవడం ఫలితంగా పెట్టుబడుల కొరత యేర్పడుతుందనికూడా వ్రాశారు. అలాగే రెండవ పంచవర్ష ప్రణాళికలో "క్రమంగా ఆర్థిక అసమానతలను తగ్గించాలి" అనే ఆశయాన్ని కొనసాగిస్తే సత్వర పారిశ్రామి

కాభివృద్ధికి ఆటంకం ఏర్పడుతుందనికూడా చెప్పబడింది. అంటే ప్రయివేట్ పెట్టుబడిదారుల దోపిడీని అరికట్టవద్దని హెచ్చరిక చేసింది. తుదకు "ప్రభుత్వం (పారిశ్రామికాభివృద్ధికి) నూతన బాధ్యతలను, ముఖ్యంగా పరిశ్రమలు, గనులకు సంబంధించి తీసుకోకుండా ఉండడం మంచిద"ని సలహాయిస్తూ తన రిపోర్టును ముగించింది.

ఇలాంటి అభిప్రాయాలనే, యీ మధ్యనే ఢిల్లీలో సమావేశమైన ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి, అంతర్జాతీయ పెట్టుబడి సంస్థల ప్రతినిధులు తమ ప్రసంగాలలో వెల్లడించారనే సంగతి గుర్తుంచుకోగలరు.

బ్రిటిష్ ప్రతినిధియైన హీత్ కోట్ అమొరీ (ఈయన బ్రిటిష్ ఆర్థిక మంత్రికూడా) ఒక పత్రికా గోష్ఠిలో మాట్లాడుతూ నిర్మొహమాటంగా తాము అప్పుగాయిచ్చే ధనమంతా తమదేశంలో సరుకులు కొనేందుకే వినియోగించాలని, అప్పులివ్వడంకంటే తమ పెట్టుబడిని మనదేశానికి తరలించడం మంచిదని, భారత ప్రభుత్వం అందు కనుకూలమైన వాతావరణం సృష్టించాలని చెప్పాడు. అంటే బ్రిటిష్ పెట్టుబడిదారులు భారతదేశంలో తిష్టవేసి మన ఆర్థిక విధానంపై పెత్తనం సంపాదించేందుకు పథకం సూచించాడు.

ప్రభుత్వ లొంగుబాటు :

ఈ షరతులకు ప్రభుత్వం క్రమంగా లోబడుతున్నట్లు కనబడుతూంది. ఈ మధ్యనే రెండవ పంచవర్ష ప్రణాళికలో కొన్ని ముఖ్యమైన కీలక ప్రాజెక్టులను వదలివేసిన పిమ్మటనే ప్రపంచ బ్యాంకు 30 కోట్ల డాలర్ల అప్పును మంజూరు చేసింది. తిరిగి ఈనాడు అప్పు లిస్తున్నారంటే భారత ఆర్థికమంత్రి వాషింగ్టన్‌లో ఏమి హామీలు యిచ్చారో, యేషరతుల కంగీకరించారో వెల్లడి కాలేదు. కాని పూర్వాపరాలను పరిశీలిస్తే విదేశీ పెట్టుబడిదారులకు పూర్తి సౌకర్యాలు కల్గించుటకు అంగీకరించినట్లే భావించవలసి వస్తూంది. ద్వితీయ ప్రణాళికలో మూలస్తంభమైన ప్రభుత్వ రంగంలో భారీపరిశ్రమల నిర్మాణం అనే సూత్రానికి తిలోదకాలిచ్చినట్లే అర్థమవుతుంది.

భారత ప్రభుత్వం అప్పుడే విదేశీ పెట్టుబడిదారులకు యీ క్రింది సౌకర్యాలు కలిగించుటకు నిశ్చయించినట్లు వార్తలు తెలుపుతున్నాయి.

మనం అమెరికాకు చెల్లించవలసిన బాకీలలో కొంతభాగం రూపాయలలో చెల్లించవచ్చు. ఈ రూపాయల మొత్తాన్ని అమెరికా తిరిగి మన దేశంలోనే పెట్టుబడిగా మారుస్తుంది. దేశీయ పెట్టుబడిదారులతో కలసి, అమెరికా, జర్మన్, జపాన్ పెట్టుబడిదారులు మన దేశంలో జాయింటు కంపెనీలు స్థాపించుటకు యీ సౌకర్యాన్ని వినియోగిస్తుంది. ఇంతవరకు బ్రిటిష్‌వారికి మాత్రమే యీ సౌకర్యం ఉన్నది.

భారతదేశంలోని విదేశీ సంస్థలలో నూటికి 51 వంతులు దేశీయ పెట్టుబడి ఉండాలని లోగడ ప్రభుత్వం విధించిన షరతులను యిప్పుడు తొలగించింది.

దేశీయ కంపెనీలవలెనే విదేశీ కంపెనీలుకూడా ఒకేసారి పన్ను చెల్లిస్తే సరిపోతుంది. రెండుసార్లు పన్ను చెల్లించాలనే పాత నిబంధన తొలగించబడింది.

ఈ సౌకర్యాలను కలిగించడమంటే భారత స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి గొడ్డలిపెట్టని వేరే చెప్పనక్కరలేదు. విదేశీ పెట్టుబడిదారుల షరతు లంగీకరించడమంటే, సామ్రాజ్యవాదుల ఆర్థిక పెత్తనాన్ని మనం చేజేతులా ఆహ్వానించడమే అవుతుంది. ద్వితీయ ప్రణాళికా లక్ష్యాలను పూర్తిగా నీరుగార్చడమౌతుంది. ఈ ధోరణి అత్యంత ప్రమాదకరం గనుక దీనిని భారత ప్రజానీకం ప్రతిఘటించవలసియుంటుంది.



# ముగింపు

ఈనాడు మన పారిశ్రామిక వ్యవస్థయొక్క స్వరూప స్వభావాలు యెలా ఉన్నాయో పైన యథాతథంగా వివరించబడింది. నేడు మన దేశంలో రెండవ ప్రణాళికా లక్ష్యాలలో చెప్పినట్లు సోషలిస్టు తరహా వ్యవస్థ నిర్మించబడుతున్నదా లేక స్వతంత్ర పెట్టుబడిదారీ వ్యవస్థాభివృద్ధికి కృషి జరుగుతున్నదా అనేది పరిశీలించాలి. పై యథార్థాలనుబట్టి స్వతంత్ర పెట్టుబడిదారీ వ్యవస్థాభివృద్ధికి కృషి జరుగుతూందని స్పష్టమవుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో "సోషలిస్టు తరహా సమాజ నిర్మాణ" లక్ష్యంగా ప్రకటించ బడినప్పటికీ మన మనదేశంలో ప్రభుత్వాధికారంలో బలీయమైన శక్తిగా బూర్జువావర్గం ఉన్నందువల్ల వాస్తవానికి వారు తలపెట్టినమార్గం ప్రాధమికంగా పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గమే. మొదటి ప్రణాళికతో పోల్చినపుడు రెండవ ప్రణాళిక అభివృద్ధి కరంగా ఉన్నమాట వాస్తవమే.

మొదటి ప్రణాళికా కాలంలో కొన్ని అనుకూలమైన జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల కారణంగా సామ్రాజ్యవాద ఫ్యూడల్ శక్తులతో పోల్చినపుడు మన జాతీయ పెట్టుబడిదారులయొక్క పరిస్థితి మెరుగయింది. ఈ అనుకూల పరిస్థితి కారణంగాను, రెండవ వైపున సర్వార్థికాభివృద్ధిని వాంఛిస్తున్న ప్రజల ఒత్తిడి ఫలితంగాను, మన బూర్జువావర్గం ధైర్యంగా స్వతంత్ర పెట్టుబడిదారీ అభివృద్ధికి వేసిన పథకమే రెండవ పంచవర్ష ప్రణాళిక. ఈ లక్ష్యంతోనే పెట్టుబడులరేటును పెంచాలనీ, అధునాతన పరిశ్రమలను ముఖ్యంగా భారీ పరిశ్రమలను నిర్మించుకోవాలనీ ప్రణాళికలో నొక్కి చెప్పడం జరిగింది. కాని సామాజికంగా మార్పులేమీ లేకుండా రెండవ ప్రణాళిక పాత వ్యవస్థను అలాగే అట్టిపెట్టదలచింది.

అయితే కొన్ని చర్యలు సోషలిజం నిర్మాణానికి తోడ్పడేవి వున్నాయిగదా అనే వాదన ఒకటుంది. ఈ వాదనను బలపరచుకుంటూ, చెప్పే మొదటి అంశం, ప్రభుత్వ రంగంలో ప్రైవేట్ రంగంలో కన్నా

యెక్కువ పెట్టుబడులు పెట్టబడుతున్నాయనేది. నిజమే, పబ్లిక్, ప్రైవేట్ రంగాలలో పెట్టుబడుల నిష్పత్తి రెండవ ప్రణాళిక ఆఖరుకు 61 : 39 ఉండ గలదు. కాని ప్రభుత్వ రంగంలో పెట్టుబడులు ఏ యే పరిశ్రమలలోనైతే ప్రైవేట్ పెట్టుబడిదారులు పెట్టుబడి పెట్టలేరో (ఉక్కు, భారీయంత్ర నిర్మాణ పరిశ్రమ వగైరాలు), ఏ యే పరిశ్రమలలోనైతే ప్రైవేట్ పెట్టుబడికి లాభాలరేటు తక్కువగా ఉంటుందో అలాంటి వాటినే ప్రభుత్వ రంగంలో నెలకొల్ప తలపెట్టారు. అలాగే ప్రభుత్వ రంగంలో నెలకొల్పదలచుకున్న పరిశ్రమలు, ఖర్చుపెట్టదలచుకున్న డబ్బూ కూడా ప్రైవేట్ రంగానికి సేవచేసే విధంగానే వున్నాయిగాని ఆ రంగానికి పరిమితులు విధించి, కంట్రోల్ చేసి క్రమంగా దానిని పబ్లిక్ ఆస్తిగా మార్చే ప్రసక్తేలేదు.

పరిశ్రమలను, వ్యవసాయాన్ని అభివృద్ధి చేయాలంటే కొన్ని లాభ దాయకంగాని ఆర్థిక తలబరువు ఖర్చులు (economic overheads) తప్పవు. వాటికి ఎక్కువ డబ్బు పెట్టుబడి పెట్టవలసిరావడం వలనా, వాటిలో లాభాలు వెంటనే రాకపోవడంవలనా, వచ్చినా తక్కువలాభాలు రావడంవలనా యిటువంటివాటిలో ప్రయివేట్ పెట్టుబడి తేలికగా తల దూర్చదు. అందులోనూ వెనుకబడిన దేశాలలో ప్రయివేట్ పెట్టుబడి దారుల ఆర్థికస్తోమత తక్కువగా వున్నందువలన యీ ఖర్చులు భరించ లేవు. కావున యిటువంటి పెట్టుబడులన్నీ ప్రభుత్వరంగంలోపెట్టి ప్రైవేట్ పెట్టుబడికి సహాయం చేయడం మామూలుగా పెట్టుబడిదారీ దేశాలలో అవలంబిస్తున్న పద్ధతే.

ఉదాహరణకు : మన రెండవ ప్రణాళికలో పబ్లిక్ రంగంలో ఖర్చు పెట్టదలచుకున్న రు. 4,800 కోట్లలో రు. 3,010 కోట్లు అంటే మొత్తంలో 62.7% అలాంటి తలబరువు ఖర్చుల నిమిత్తమై కేటాయించబడ్డాయి. రవాణా రాకపోకల అభివృద్ధికి రు 1,335 కోట్లు, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి పథకాలకు రు. 863 కోట్లు, సాంఘిక సంక్షేమ పథకాలకు రు. 455 కోట్లు, వ్యవసాయము, సమాజవికాస పథకాలకు రు. 338 కోట్లు, యితరములకు రు. 19 కోట్లు ఖర్చు చేయదలచారు. ఈ విధంగా రెండవ ప్రణాళికలో పబ్లిక్ రంగంలో ఖర్చుపెట్టదలచిన దానిలో అయిదింట మూడున్నర వంతులు ప్రయివేట్ పెట్టుబడికి సహాయకారిగాను, దాని అభివృద్ధికి

ద్రోహం చేసేదిగాను ఉన్నదే తప్ప దానిని కుంటుపరచేదిగా ఏమాత్రం లేదు. నిజానికి పబ్లిక్ రంగంలో యీ పెట్టుబడులే లేకపోతే ప్రయివేట్ పెట్టుబడి నష్టపోతుంది.

పబ్లిక్ రంగంలో మిగిలిన పెట్టుబడులుకూడా ప్రయివేట్ పెట్టుబడిని దెబ్బతీసేవేమీ కావు. ఉదాహరణకు గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలకు రు. 120 కోట్లు కేటాయించబడ్డాయి. ఈ పరిశ్రమలు ప్రయివేట్ పెట్టుబడిదారులకు లాభదాయకమైనవి కావు. పైగా యివి అభివృద్ధికావడం ప్రయివేట్ పెట్టుబడికి చాలా తోడ్పడుతుంది. అదేవిధంగా ఎరువుల ఉత్పత్తికి రు. 37 కోట్లు, రవాణా సాధనాల పరికరాల నిమిత్తం రు. 33.6 కోట్లు ఖర్చుపెట్టదలచారు. వీటి అభివృద్ధికి (బ్రిటిష్ హయాముయొక్క ఆఖరి రోజులలోనే పథకాలు వేయబడ్డాయంటే యివి ఎవరికి తోడ్పడుతాయో స్పష్టమే. పోతే ప్రయివేట్ పెట్టుబడికి ఏ విధంగానూ లాభాలు చేకూర్చలేని చమురు గనుల పరిశోధనకు రు. 11.5 కోట్లు, భూగర్భ పరిశోధనకు రు. 6 కోట్లు కేటాయించబడ్డాయి. పోతే బొగ్గు గనుల నిమిత్తం ప్రత్యేకించబడిన రు: 40 కోట్లు మాత్రం కొంతవరకు ప్రయివేట్ రంగం స్థానాన్ని ఆక్రమించుతుంది. ఈ సందర్భంలో బ్రిటిష్ పరిపాలనాకాలంలోనే రైల్వేలు వగైరాలకు కావలసిన బొగ్గు నిమిత్తం బొగ్గు గనులు పబ్లిక్ రంగంలో ప్రారంభించబడ్డాయనేది గుర్తుకు తెచ్చుకోవలసియుంటుంది. ఈనాడు పబ్లిక్ రంగంలోని రైల్వేల విస్తరణకు, ఉక్కు పరిశ్రమలకు అవసరమైన బొగ్గు నిమిత్తం యీ మాత్రం బొగ్గుగనులకు వినియోగించడం పెద్దసోషలిస్టు పరిణామంగా భావించ వీలులేదు. ఇంగ్లండులో కూడా లేబర్ పార్టీ పరిపాలనలో జాతీయం చేయబడిన బొగ్గుగనులను కన్సర్వేటివ్ పార్టీ అధికారంలోకి వచ్చాకకూడా అలాగే ఉంచింది. మిగిలినవి పబ్లిక్ రంగంలో 350 కోట్ల రూపాయల ఖర్చుతో నెలకొల్పబడుతున్న యినుము, ఉక్కు కర్మాగారాలు, రు. 34 కోట్ల ఖర్చుతో నెలకొల్పదలచిన భారీయంత్ర నిర్మాణ పరిశ్రమ. ఇవి నెలకొల్పడం (చాలా యెక్కువ పెట్టుబడి గావడంవలన) మన ప్రయివేట్ పెట్టుబడికి సాధ్యంగాదు. కాని యివి స్వతంత్ర పెట్టుబడిదారీ అభివృద్ధికి అత్యావసరాలు.

పైవిషయాలను పరిశీలించినపుడు ప్రభుత్వరంగంలో నెలకొల్పదలచుకున్న పరిశ్రమలు వగైరాలు సత్వర పెట్టుబడిదారీ పారిశ్రామికాభివృద్ధికి

తోడ్పడేవని స్పష్టమవుతుంది. వాస్తవంగా ప్రణాళికయొక్క మొదటి రెండు సంవత్సరాలలో జరిగినదిదే. గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థ చెక్కు చెదర కుండాకాపాడబడడం, పెట్టుబడిదారులు సంపాదిస్తున్న లాభాలు, వారికి ప్రభుత్వం కల్గించిన సౌకర్యాలు, వారి లాభాలనిమిత్తం కార్మికుల దోపిడీని యెక్కువచేసేందుకు తోడ్పడే కార్మిక విధానాలు, ప్రజలపైన అధికాధికంగా పన్నులు విధించే పద్ధతులు - యివన్నీ యిందుకు తార్కాణాలు.

ఇంపీరియల్ బ్యాంకు, జీవితభీమాలను జాతీయం చేయడం సోషలిస్టు నిర్మాణానికి చిహ్నాలుకావా అని కొందరు ప్రశ్నించుతున్నారు. భారత దేశంలో బూర్జువావర్గం ఆర్థికాభివృద్ధిని కేవలం మార్కెట్ పోటీ యొక్క దయాదాక్షిణ్యాలకు వదలివేయవలచుకొనలేదు. ఒక నిర్ణీత పద్ధకం ప్రకారం అభివృద్ధిని సాధించవలచుకున్నది. దానికి ప్రయివేట్ రుణాలను మంజూరు చేయడం, నిల్వలను సేకరించడం ఒక పద్ధతిలో కంట్రోల్ చేసి అవసరమైన విధంగా ఉపయోగించవలచింది. అందువలననే నీటికి సంబంధించి కీలకంగావున్న ఇంపీరియల్ బ్యాంక్, జీవిత భీమాలకు పూర్తి నష్ట పరిహారమిచ్చి జాతీయం చేయడం జరిగింది. జాతీయం చేశాకకూడా యివి ఒక క్రమపద్ధతిలో ప్రయివేట్ రంగానికే సహాయంచేస్తూ ఉండడం గమనించాలి. అదేవిధంగా పారిశ్రామిక పెట్టుబడుల సంస్థ (Industrial Finance Corporation), ప్రభుత్వపెట్టుబడులసంస్థలు (State Finance Corporation) వగైరాలు ప్రభుత్వరంగంలో నెలకొల్పబడినా ప్రయివేట్ రంగానికి కూడా సహాయం చేస్తున్నాయి.

మరొక విషయాన్ని పరిశీలించినా పైన చెప్పినదే రుజువవుతుంది. సోషలిస్టు వ్యవస్థలో పారిశ్రామికోత్పత్తికీ మూలకంధమైన కార్మికవర్గం పరిశ్రమలకు నిజమైన యజమానిగాఉంటుంది. కాని మనదేశంలో ఈనాడు ప్రభుత్వ రంగంలో కూడా కార్మికులకట్టి స్థానములేదు. ప్రయివేట్ రంగంలో కార్మికుని పరిస్థితివలెనే ప్రభుత్వ రంగంలోని కార్మికుని స్థితికూడా ఉన్నది. ప్రభుత్వరంగాన్నికూడా పెట్టుబడిదారీ సిద్ధాంతాలు గల బూర్జువా, పెటీబూర్జువా, ఫ్యూడల్ వర్గాల నుండి వచ్చినవారే నిర్వహిస్తున్నారు. కార్మికులను అప్పుడైనా ప్రధాన స్థానాలలోనికి ప్రమోట్ చేయడమనేదే జరగడంలేదు.

సోషలిస్టు నిర్మాణానికి చిహ్నంగా వ్యవసాయ రంగంలో జమీందారీల రద్దు, కౌలుదారీ రక్షణ, పన్నుల తగ్గింపువగైరా చట్టాలు చేవాలని ప్రణాళికలో చెప్పినదానిని ఉదహరించడం జరుగుతుంది. ఇచట ఫ్యూడల్ వ్యతిరేక చర్యలను సోషలిస్టు చర్యలుగా భావించుతున్నారు. నిజానికి యీ చర్యలవలన జరిగేది సోషలిస్టు నిర్మాణం కాదు. సోషలిస్టు నిర్మాణానికవసరమైనవి దున్నేవానికే భూమిని పంచిపెట్టటం, క్రమానుగతంగా సహకార వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం వగైరాలు పునాదిగా ఉంటాయి. కాని అలాంటి దేవీ మన ప్రభుత్వం తలపెట్టలేదు. పెట్టుబడిదారీ అభివృద్ధికిగల ఆటంకాలను తొలగించుకొని అనుకూల పరిస్థితులను సృష్టించుకోవడమే ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల లక్ష్యం. ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థస్థానే పెట్టుబడిదారీ వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టడమే వీటియొక్క పరమావధి. (వీటినిగురించి "వ్యవసాయ వ్యవస్థ" అనే పుస్తకంలో వివరంగా తెలుసుకోగలరు).

మొత్తంమీద పైపరిశీలననుబట్టి యీనాడు మనదేశంలో ప్రణాళికాబద్ధమైన స్వతంత్ర, పెట్టుబడిదారీ వ్యవస్థాభివృద్ధికి మాత్రమే కృషి జరుగుతూందని రుజువవుతుంది.

సమాప్తం.

# చదవ వలసిన గ్రంథాలు




1. Indian Economy — Its Nature & Problems
By ALAK GHOSH

2. Indian Economics — By K. K. DEWETT

3. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక - కేంద్రప్రభుత్వ ప్రచురణ.

4. రెండవ పంచవర్ష ప్రణాళిక : ఒక విమర్శ - భూపేష్‌గుప్త.

5. రెండవ పంచవర్ష ప్రణాళిక : పరిశీలన - మోటూరి హనుమంతరావు

6. On The Public Sector — By SAILEN GHOSH

7. On Unemployment — By K. P. SUBRAMANYA MENON

8. On Monopoly — By AMAR SEN

9. రెండవ పంచవర్ష ప్రణాళిక : కార్మిక విధానం
— కె. యల్. నరసింహం

10. Relevent Articles
By B. T. Ranadive, K. C. K. Menon
and Essen in New Age weekly.


